# కృతజ్ఞతలు

వ్యాసపద్మానికి ఆదరంతో ముందు మాట వ్రాసిన శ్రీ ఆంధ్రప్రదేశ్ హైకోర్టు జడ్జి, సుప్రసిద్ధ రచయితలు, మేధావులు, సహృదయులు అయిన శ్రీ ఆవుల సాంబ శివరావుగారికి నా కృతజ్ఞతలు. నా సాహిత్యాభివృద్ధికి సహకరించి నా రచనలు ఆదరించిన ప్రముఖ జర్నలిస్టు సోదరులు, శ్రీ జి. వి. ఎల్. నరసింహారావుగారికి కృతజ్ఞతలు. ఈ వ్యాసాలు ఆంధ్రప్రభ వీక్లీ, సౌరభ, ఉషస్సు, జయశ్రీ, విశ్వరచన, తెలుగు రాజ్యం, సరస, ఉజ్జీవన, కళాకేళి, తొలికోడి, విజయభాను, శాంతి, శ్రీమతులు, ఇంకా తదితర పత్రికలలో అచ్చయినవి. ఆయా పత్రికా సంపాదకులకు నా కృతజ్ఞతలు. ఈ పుస్తకాన్ని ఎంతో శ్రద్ధతో అందంగా ముద్రించిన శ్రీపతి ప్రెస్ అధిపతులు శ్రీ వెంకటరత్నంగారికి, శ్రీ గణేశ్వరరావుగారికి కృతజ్ఞతలు.

— అడవికొలను పార్వతి

**AVULA SAMBASIVA RAO,**
*Judge, High Court of A. P.*

*D. 16-11-76.*

# ముందుమాట

ఈ వ్యాససంపుటి చదివాక కొన్ని భావాలు నాలో కలిగినై. మొదటిది రచయిత్రి భావనాసరళిలోని వైవిధ్యం. భక్త్యావేశానికి ప్రతిబింబమైన శారదాదేవి జీవితం నుండి, విప్లవజ్యోతి అయిన లెనిన్ వ్యక్తిత్వంవరకు ఇందులోని పరిశీలన విస్తరించింది. పెక్కు రచనలలో, ముడుచుకుపోయిన మేధస్సును పాతుకుపోయిన భావాలను చూస్తాం. ఈ వ్యాస పద్మంలో అలాకాదు. ఏవిషయం రచనావస్తువుగా గ్రహించినా, పార్వతిగారు దాన్ని నిశితంగా, సహృదయంతో పరిశీలించారు. ఇట్టి విశాలత అరుదు.

రెండవది, స్త్రీజాతికి జరిగిన అన్యాయాన్ని గురించి రచయిత్రి హృదయంలో రగిలే ఆవేదన ఇందులో కొట్టవచ్చినట్లు కనిపిస్తుంది. ఆ మాటకువస్తే అన్యాయాన్ని చూచి సహించలేని న్యాయదృష్టి పార్వతిగారిలో నిండుగా వుంది.

మూడవది, ప్రపంచవ్యాప్తంగావున్న బావుకతతో పార్వతిగారికున్న సన్నిహితపరిచయం. వారు ఎంతగా చదివారో, ఎంతగా ఆలోచించారో యీవ్యాసాలు చూపెడతై. చదవడానికి ఇచ్ఛలేనివారు, కొత్తపుంతన ఆలోచించడానికి

వెరిచేవారు రాయడానికి అర్హత పోగొట్టుకుంటారు. పార్వతి గారు యీ అర్హతను పెంచుకున్నారు.

నాలుగవ విశేషం, యీరచనలోని పొంగులారేఆవేశం, ఆ ఆవేశాన్ని పాఠకునికి అందించగల రచనాశిల్పం, శైలి, ఇన్నిటిని అలవరచుకున్న అడవికొలను పార్వతిగారిని అభినందిస్తున్నాను.

— ఆవుల సాంబశివరావు.



**M. R. APPAROW,** *M. A.,*
*M. L. A.*
Vice- Chancellor,
Andhra University,
WALTAIR.

శ్రీమతి అడవికొలను పార్వతిగారు రచించిన మందారాలమాల అన్న కథలసంపుటి అందింది. ఇందులో జానకి, ఈ అన్యాయం సమసిపోవాలి, అబల మొదలైన పదికథలున్నాయి. శ్రీమతి పార్వతిగారు అనేకపట్టణాలలోను, పల్లెలలోను ఇళ్లల్లో స్త్రీలుపడేబాధలు చూస్తూ, చెవులారవింటూ హృదయం ద్రవించుకుపోయి, తప్పుదారిలోపడి చెడిపోతున్న పురుషులకు వివేకం, స్త్రీలకు చైతన్యంకలిగించడానికి ఇలాంటికథలు వ్రాశారు.

మన స్వతంత్రభారత దేశం అన్నివిధాలా పురోగమించాలని కులమతవైషమ్యాలు, మూఢనమ్మకాలు, మూఢాచారాలు నశించాలని, మనదేశంలో స్త్రీలకు ఉత్తమస్థానం ఇవ్వాలని స్త్రీలసమస్యలు పరిష్కరించాలని ఇంటా బయటా శాంతి ఉండాలని శ్రీమతి పార్వతిగారి ఆశయం.

మనభారతదేశ స్త్రీలు అంతర్జాతీయ స్థాయికి వెళ్ళడానికి కృషిసల్పవలసిన సమయం ఆసన్నమైనందువల్ల స్త్రీలు కూడా శారీరకంగా బలాన్ని, మానసింగా ధైర్యాన్ని, కార్యసాధనకు విజ్ఞానాన్ని పెంపొందించుకొని సమసమాజ స్థాపనకు పూనుకోవాలి.

స్త్రీపురుషుల మనస్తత్వాలు మారడానికి ఇటువంటి కథలు అవసరమే. భారతదేశంలో రచయిత్రులు ఉత్తమాశయాలతో కథలు, గేయాలు, నవలలు వ్రాస్తూ స్త్రీపురుషుల ఆత్మగౌరవం, కుటుంబసౌఖ్యం, దేశశాంతి పెంపొందడానికి కృషిసల్పుతున్నారు. శ్రీమతి పార్వతిగారు తనలక్ష్యం సిద్ధించేవరకు ఉత్తమకథలు వ్రాస్తూ సాహిత్యసేవ చేస్తారని ఆశిస్తున్నాను.

యం. ఆర్. అప్పారావు.



# ప్రముఖుల అభిప్రాయాలు

—/o/—

**Dr. (Smt.) Durgabai Deshmukh**

Dear Smt. Parvathi,

I am sorry for the delay in writing to you about your book "Mandarala Mala" which you have so kindly sent to me. I have gone through it very carefully and I must congratulate you and express to you my appreciation and happiness. You had really chosen very good themes for your stories representing each aspect of the women's life, position in society. I had sent this book to Andhra Mahila Sabha School where there are thousands of students who could benefit by reading your book. Once again thanking you for sending me this book.

Wishing you all sucess.

Yours sincerely,
Durgabai Deshmukh.

* * * *

**శ్రీ గుంటూరు శేషేంద్రశర్మ**

మీ కథలన్నీ చదివాను. కవితలుకూడ. కథల కంటె కవితలు, కవితలు కంటె కథలు బావున్నాయి. స్త్రీలకు ఆర్థిక

సమానత్వం రానిదే మిగతా సమస్యలకు పరిష్కారం దొరక దని నా అభిప్రాయం. స్త్రీ విలువని, గొప్పతనాన్ని మీకథల్లో బాగా చిత్రించారు. ఉభయ ప్రక్రియలలోను మీరు సవ్య సాచిత్వం చూపించారు. మీకు నా హృదయపూర్వకాభి నందనలు.

*    *    *    *

శ్రీ కప్పగంతుల మురళీకృష్ణ
(Quality Publishers, Vijayawada)

మీ అరుణ కిరణాలు ఏకబిగిని చదివాను అనే కంటే మీ పుస్తకము చదివించింది అంటే బావుటుంది. మీరు మంచి మాత్రాఛందస్సువున్న వచనకవిత రాసారు.

స్త్రీలలో మీలా వ్రాసేవారు లేరుకదా!

మీ మందారాలమాల కథాసంపుటి చాలా చాలా మంచి ఉత్తమ ఉన్నత గ్రంథం. సాంప్రదాయ, మధ్యతరగతి కుటుంబాల్లోని స్త్రీలు ఎక్కువ మంది మీరు వ్రాసిన ఏదో ఒక సంఘటనకు గురౌతున్నారు. అది నిజం! ఇలాంటి పుస్తకం ఇలాంటి ప్రత్యేక సమస్యల మీద వచ్చినది తెలుగు సాహిత్య ములో నాకు తెలిసినంత వరకు ఇదే మొదటిది. అందుకు మీకు జాతి ఋణపడి ఉంటుంది. ఇంతవరకు ఈ సమస్యల (మందా రాల మాల్లో) మీద ఏ ఆడ రచయిత్రి అయినా కనీసం ఆడంగి రచయిత్రి అయినా రాస్తే బావుండును. ఇవి చిన్న విషయాలు కావు అనుకుండేవాడిని. ఇప్పుడు మీరు అసలైన

ఆడవారై వ్రాసి ఎంతో ఉపకారము చేసేరు సాహిత్యానికి. అందుకు నా ధన్యవాదాలు. మీరచనలు ముఖ్యంగా ఈరెండు పుస్తకాలు అమూల్యమైనవి. తెలుగు జాతికి ముఖ్యంగా స్త్రీ జాతికి మందారాలమాల పెట్టని ఆభరణాలు.

*    *    *    *

శ్రీ ఆచార్య రంగా

అమ్మాయి పార్వతీ!

శుభం. నీవు పంపిన నాలుగు పుస్తకాలు చదువుకున్నాను. నా ప్రియమిత్రుడు మందేశ్వరుని పుత్రికననే అభిమానంతో ఇన్ని పుస్తకాలు ఇంత సుందరంగా అచ్చువేయించి ప్రీతితో పంపావని ప్రాణం లేచివచ్చింది. చదవడం మొదలు పెట్టితిని కదా మందేశ్వరులు ఊహించుకొన్న గ్రామిక ధర్మ రాజ్యసిద్ధాంతానికి వరవడి పెట్టగల్గిన ఇంతటి సుపుత్రిక మాకందరికి కూడ పుస్తకాలిలా అందచేస్తున్నదికదా అవి ఆనందమైనది. ఇప్పుడేగనుక వీరేశలింగం, ఉన్నవ లక్ష్మీనారాయణ, కవిరాజు రామస్వామి, భారతీదేవి ఉంటే ఎంత ఆనందింతురు! నీది మాది అదృష్టమమ్మా! నీకథల చదువుతున్నకొలది విప్లవ జ్యోతులు రేకెత్తించే ఈ రచనలు, ఇట్టి సాహిత్యం ఇంకా ఇంకా కావాలనిపిస్తుంది. రైతులను, గిరిజనులను మేల్కొలుపుటలో, సేవించుటలో నాతో భాగస్వామియైన మా మందేశ్వరశర్మ అమ్మాయి, మా అమ్మాయిగా పెరిగి, మా విప్లవ

వంగడానికి వన్నెలు కల్గించుచువచ్చి వెలుగునిస్తున్నావని ఆనం దము నాకు కల్గుచున్నదమ్మా! ఆనాడు ఆచలం వ్రాసిరి. ఆ బెంగాల్‌లో శరత్ కూడా వ్రాసిరి. అక్కడ టాల్‌స్టాయ్ కూడా! మాలపల్లి (నవల) లో హృదయముల నుత్తేజపరచు వారున్నారుకదా! ఇప్పుడీ కథలు నీద్వారా అందుచున్నవి. మన కుటుంబములలో మన అమ్మలు, అక్కచెల్లెండ్రు, బిడ్డలు పడు తున్న బాధలు వాస్తవజీవితమును ప్రతిబింబింపచేస్తున్నావు! మా మందేశ్వర్యుని విప్లవజ్యోతులకు ఇంతటి ప్రమిదల్లు, నెయ్యి వేసి, వేగము అందించుచున్నావు. ఈ పుస్తకాలు ఇలాగ నీద్వారా వస్తూనే ఉండాలి. వీటిని చూచియైన ఇంక రాబోయే యువతీమణులు ఇలాంటి అభివృద్ధిదాయకమైన విప్లవాత్మక మైన రచనలు, పదాలు, పద్యాలు వెల్లివిరియింతురు గాత! భార్యా భర్తలు పరస్పరంగా ప్రేమించుకోవాలి, గౌరవించు కోవాలి! విజ్ఞానధనమును పెంచుకోవాలి. అదంతా సాధ్యం కావాలంటే స్త్రీలు పురుషునితోపాటు సమాన గౌరవం, స్థాయి, సాంఘిక సౌకర్యాలు, అందుకోగల్గాలి. అందుకునీలాంటి యువతులు యిట్టి సంఘసేవా తత్పరతతో ఇలాంటి రచనలు చేయాలి. నీకు సర్వశుభములు సర్వేశ్వరుడు అందించుగాక!



# విషయసూచిక



# మాతృశ్రీ శారదాదేవి జీవితసారభాలు

అమ్మా! నీవు ప్రేమమూర్తివి! ఆవేశంతో ఉద్రేకంతో కూడిన మా ప్రేమవంటిదికాదు మీప్రేమ. ఎవ్వరికి హాని కల్గింపనిది, ఎల్లరకు మేలొనగూర్చునదియునయిన మంజుల ప్రశాంతప్రేమ నీది అంటూ శ్రీ శారదాదేవికి సోదరి 'నివేదిత' లేఖ వ్రాస్తుంది. అవును! ఆ మాటలు ఎంత సమంజసములు.

శ్రీ శారదాదేవి కలకత్తాకి సమీపముగనున్న 'జయరాంబాటి' అన్న గ్రామమునందు రామచంద్రముఖోపాధ్యాయుడు అను సద్బ్రాహ్మణునకు 1853 డిసెంబరు 22న జన్మించెను. అతడు రామభక్తుడు, మహాదాత. అతనిభార్య శ్యామసుందరీదేవి అతనికి తగిన ఇల్లాలు. శారదాదేవి తల్లినిగూర్చి ఓచోట ఇలాఅంటారు. శిష్యులు ఇంటికివచ్చినంతనే మా అమ్మ తనకన్నబిడ్డలనలెనే వారిని ఆదరించి గారాముతోచూసి ఎంతో ఉప్పొంగిపోయెడిది అని. ఇటువంటి మహనీయుదంపతుల కుద్భవించిన శారాదాదేవి మహోత్తమువారి కాకపోవుటెట్లు ?

శారదాదేవి బాల్యమునుండి సహనశీల, కష్టసహిష్ణుత కలిగివుండెడిది. ఆమె పుట్టినది అమితైశ్వర్యవంతుల కుటుంబముకాదు. ఆవిడ తనబాల్యాన్ని వర్ణిస్తూ "నా చిన్నతనంలో ఒకసారి కుత్తుకబంటి నీళ్ళలోదిగి ఆవుకి గడ్డికోయుదానను,

పొలములో పనిచేసే కూలివారి కాహారం తీసుకువెళ్లే దానను. చిన్నతనమునుంచి మా అమ్మకు వంటపనిలో చాలాసాయముగా వుండేదాన్ని" అంటారు. శారదాదేవి జీవితమునుంచి ఇలాంటి కష్టసహిష్ణుత, ఇంటి పనులయందు పెద్దలకు సహాయపడుట మొదలగు విషయాలు మనమందరం నేర్చుకోవాలి.

పువ్వు పుట్టగానే పరిమళించు నన్నటుల చిన్నతనాన్ని ఆటపాటలలో "జగద్ధాత్రీ" పూజ యొనరించునపుడే ఆమె తన్మయతతో ధ్యాన మొనరించేది. ఇదిచూసి పెద్దలెంతో ఆశ్చర్యము చెందేవారు. పసిబాల కేమిటి? ఈ నిశ్చలధ్యాన తత్పరతఏమిటని? ఆ రోజుల్లో స్త్రీకి విద్య అనవసరం అన్న అభిప్రాయముతో సంఘముండుటచే ఆమె బడికివెళ్లి చదువుకొనే అవకాశము కలగలేదు. అయితే విద్యయందు అధికాభిమానముగల శారద పెద్దయ్యాక స్వయంకృషిచే చదువను, బాగా వ్రాయను కొద్దిగా నేర్చినది. ఆమెకు విద్యయందెంత అభిమానమో ఈ క్రిందివిషయమువల్ల తెలుస్తుంది. ఒకప్పుడు "శ్యామాపుష్కరము"నకు శ్రీరామకృష్ణ పరమహంస చికిత్స నిమిత్తం వెళ్ళారు. అప్పుడు దక్షిణేశ్వరములో శారదామాత ఒంటరిగా ఉండేవారు. అప్పుడు గంగాస్నానముకోసము ముఖోపాధ్యాయుని కుటుంబములోని ఒక బాలికవస్తూ అక్కడికి దగ్గరిలోవున్న శారదాదేవి వద్దకు వచ్చేది. అలాంటి సమయములో తీర్థికైనప్పుడు ఆబాలిక శారదాదేవికి విద్యనేర్పేది. దానికి ప్రతిఫలంగా దేవాలయమునుంచి తనకి పంపబడే కూర

గాయులు, తినుబండారాలు ఎక్కువగా ఆ బాలిక శ్రమకు ప్రతిఫలముగా నేనిచ్చేదాన నంటూరు, శారద! విద్యనేర్పేది తనకన్నా చిన్నబాలికయినా ఎంతగౌరవముతో అభిమాన ముతో ఆవిడ విద్యని గ్రహించేదో మనము తెలిసికోగలిగితే గురువునెడ ఎంతభక్తి విశ్వాసాలతో మెలగాలో గోచరి స్తుంది. మహానీయులెప్పుడూ వారిచేతలద్వారా మనకి మార్గం చూపుతారు. మాతృదేవి, శ్రీరామకృష్ణ పరమ హంసకూడా స్త్రీ విద్యయొక్క ఆవశ్యకతను పదేపదే వక్కా ణించారు పలు సందర్భాలలో.

శ్రీరామకృష్ణునకు బాల శారదాదేవికి 1869 మేనెలలో వివాహం జరిగింది. వివాహం అయ్యాక శారదాదేవి చాలా కాలము పుట్టింటనే వుండేది. లోకులు చాలమంది శారద మగడు "పిచ్చివాడట ఎప్పుడూ దిగంబరుడై 'హరి హరి' అని తిరుగుతూ వుంటాడట" అని పల్కేవారు. వారిమాటలు చెవినిపడడం ఇష్టంలేక శారదాదేవి ఇల్లువదలి బయటకు వెళ్ళేది కాదు. ఇలా మరి కొంతకాలముగడవగా కలకత్తాలో గంగా స్నానానికి తన బంధువులు కొందరు వెళ్తూంటె తను వెళ్తానని ఆమె తండ్రికి తెలిపింది. కూతురు భర్తవద్దకువెళ్ళే ఉద్దేశ ములో వున్నదని గ్రహించిన తండ్రి సరేఅని తనూ బయలు దేరాడు.

శారదాదేవి వెళ్ళి దక్షిణేశ్వరములోవున్న రామకృష్ణ పరమహంసను సందర్శించారు. "ఆహా! వచ్చావా! మంచిది,

కూర్చుండు"మని రామకృష్ణుడు ఆమెను ఆదరముతో ప్రశ్నించి ఆదరించారు. భార్య తన తపోవిఘ్నకారి అని ఆయన ఏమి విముగుకోన లేదు.

శ్రీ శారదా రామకృష్ణుల దాంపత్యజీవితము కేవలం ఆత్మసంబంధ మైనది. అధ్యాత్మికసంబంధ మైనది. ఆమె నిష్కామభక్తితో ఆయన్ని సేవించి తరించినది. తను తరించడమే కాక మనందరికీకూడా మార్గదర్శకురాలయింది. భార్యాభర్తల సంబంధం అనగానే కేవలం విషయవాంఛలకు పరిమితమయి నట్టిదికాదని చెపుతూ ఓ అపూర్వ దాంపత్యజీవితవిధానాన్ని మనముందుంచారు. ఆ దంపతులు చరిత్రలో ఎందరో మహా పతివ్రతామతల్లులు అమర ప్రేమికులు ఉన్నారు. వారందరూ దాంపత్య ధర్మాలని ఆశించినవారే. కాని ఇలా నిర్హేతుకముగా, నిష్కామభక్తిగా భర్తను పూజించినవారు లేరనే చెప్పవచ్చు. అలాగే భార్యను ఓ జగన్మాతక్రింద పూజించి తన తపోఫలాన్నంతా ధారపోసి, ఆమెను పూజించిన రామకృష్ణునిలాంటివారు మరెవ్వరూ లేరు.

దక్షిణేశ్వరంలో మాతృదేవి నివసిస్తున్నప్పుడు శ్రీ పరమహంసకి కలిగిన దివ్యానుభూతుల్ని చెపుతూ, ఆయన దివ్యాత్మభావాలతో ఒకప్పుడు నవ్వుతూ, మరియొకప్పుడు ఏడుస్తూ ఇంకోసారి సమాధిగతులై వుండేవారు. ఒక్కోసారి రాత్రంతా ఇలాంటిస్థితిలో ఆయనుంటే పిన్నవయస్కురాలగు తను చాలభయపడిపోయేది. కాని ఆ తర్వాత పరమహంస

తను ఏఏ సమాధిస్థితులలో వున్నప్పుడు ఏఏ భగవన్నామం వుచ్ఛరిస్తే బాహ్యస్మృతి కలుగుతుందో ఆమెకి చెప్పారు. ఆమె అలా ఆచరించేవారు. అయినాకూడా ఆయనకి ఎప్పుడు సమాధిస్థితి వస్తుందో అని ఒకోసారి రాత్రంతాకూడా మేల్కొనే వుండేవారు. చరిత్రలో యిదెంత అపూర్వ దాంపత్యం, అమరప్రేమ! శారదాదేవి త్రికరణశుద్ధిగా బ్రహ్మచర్యవ్రతమును అవలంబించుటకు ఇష్టపడినది. ఒకసారి పరమహంస ఆమె వచ్చినక్రొత్తలో "నన్ను మాయలోకి లాగుట నీ అభీష్టమా?" అని అడుగుగా "లేదు. పారమార్థికమార్గములో మీకు తోడ్పడుటే నా అభీష్ట"మని వచించిరి. ఇలాంటి ధీర చరితనుకన్న మన భరతమాత ఎంత అదృష్టవంతురాలో కదా! శ్రీరామకృష్ణ పరమహంస దక్షిణేశ్వరంలో కాళికాలయంలో 1873 మేనెలలో శారదాదేవిని జగన్మాతృభావంచే 'షోడశీపూజ'తో అర్చించి తన తపోసాధనలను, తన అన్ని కర్మలను ఆఖరికి జపమాలతోసహా ఆమెకు సమర్పించారు.

భార్య (స్త్రీ) సంసారబంధనానికి హేతువు, స్త్రీలు చపలచిత్తులూ, కాముకులు, పాతకిలు అని ఎక్కడో ఓచోట ఎంత మహానుభావులయినా అన్నారు. అలాంటిది ఒకే ఒక రామకృష్ణ పరమహంస స్త్రీని అందునా భార్యను సృష్టి, స్థితి సంహారహేతువైన "జగన్మాతగా" భావించి ఆమెముందు పసివిల్లవానిలాగా అత్యంత నిర్మలభక్తితో తన తపఃఫలాన్ని అంతా అర్పించి ఆమెను కటాక్షించమని వేడుకొన్నాడు.

అంతేకాదు శ్రీ పరమహంస వివిధమంత్రాలను, వానిని ఉప దేశించే విధానాలను శారదాదేవికి ఉపదేశించి స్త్రీలు గురు స్థానానికి ఎంతైనా తగినవారని నిరూపించేరు.

శ్రీ శారదాదేవి ఒకసారి తన భక్తురాల్ని ఉద్దేశించి ఇలా అంటారు. "నీవు ధ్యానంలో దివ్యదర్శనాలు కాంచ లేదని ఏం నిరాశచెందకు. అవి అల్పవిషయాలు. భగవత్సా క్షాత్కారానికి కావలసినది నిర్మలమైన మనస్సు, నిర్మలమాన సంలో బ్రహ్మానుభవం కలుగుతుంది." ఈ మాటలు అన్నీ అక్షరాలా నిజం.

శ్రీ బాపూజీ ప్రతి చిన్నవిషయములో చిన్నపనిలో ఎంతో శ్రద్ధను చూపినట్టే వారిముందుతరంవారైన శ్రీ పరమ హంసకూడా ప్రతీవిషయంలో ఎంతో శ్రద్ధనుచూపి శారదా దేవికి ఎంతో శిక్షణ ఇచ్చారు. గృహంలోని వస్తువులు ఎలా సర్దుకోవాలో, తీసిన వస్తువులు యథాస్థానంలో వుంచడం ఎంత అవశ్యమో చీకటిలోకూడా ఆ వస్తువును తడుముకోకుండా తీయాలంటే దాన్ని యథాస్థానములో వుంచితేనే అది వీలవు తుందని చెపుతూ; ఇంకా తమలపాకులు చిలకలు చుట్టడం, కూరలుతరగడం, దీపాలకి వత్తులు పేనడం దగ్గరనుంచి ఆయా పనులలో నిపుణత్వం అంతా నేర్పారు. "యోగః కర్మసు కౌశలం" అనికదూ భగవానుడు శలవిచ్చాడు. అంతేకాదు భగవద్భక్తిపేరిట, ఆధ్యాత్మికతపేరిట పనులుమాని కూర్చోడం, చేసేపని సుశిక్షణగా చేయకపోవడము అలసత ఇవెంత

మాత్రము తగవని పదే పదే హెచ్చరించారు మనలని శారదా రామకృష్ణులు.

రామకృష్ణ పరమహంస శారదాదేవికిచేసిన ఉపదేశాలు మన అందరికీకూడా ఎన్నోవిధాల ఉపకరిస్తాయి. దేశ కాల పాత్రానుగుణముగా మెలగు సామర్థ్యమె కుటుంబానికి, సంఘానికికూడా రక్షయని యోగ్యులెవరో, అయోగ్యులెవరో పరిశీలించి, స్నేహితుల నెన్నుకోవాలని చెపుతూ, కొందరితో మనసిచ్చి కలసి మెలసి మెలగవచ్చని, మరికొందరితో ముఖపరిచయము మాత్రమే తగునని మరికొందరితో మాటలాడుట కూడా పనికిరాదని (ఆయా వ్యక్తుల స్వభావాలనుబట్టి) శ్రీ పరమహంస చెప్పారు.

త్రాసువంటి తూకముగలది పరమహంస ఆరోగ్యం. శారదాదేవి బహుజాగ్రత్తగా భోజనాదికాలు తయారుచేసి, ఆయన ఆరోగ్యాన్ని కాపాడటములో మెప్పుపొందేవారు. అంతేకాదు అత్తగారు చంద్రదేవితోకూడా ఆమె తలలో నాలికలా మెలిగి ఉపచారాలు చేసేది. శ్రీ పరమహంస వద్దకు వచ్చే శిష్యబృందాని కందరికీ స్వయముగా శారదాదేవి వంట చేసి ఇనుమడించినప్రేమతో కుడువబెట్టేవారు. వివిధవ్యక్తులకు వివిధరకాలయిన వంటకాలు చేయవలసివుండుటచే ఆవిడకు ఒకోసారి అహర్నిశలు వంటఇంటితోనే సరిపోయేది.

అయితే ఆమె ఎంతటి కార్యభారములో మునిగివున్నా నిత్యకృత్యాలను అత్యంతనియమంగా నెరవేర్చేది. బ్రహ్మ

ముహూర్తములో లేచి గంగాస్నానంచేసి పూజాధ్యానాది కాలు నెరవేర్చేవారు.

శారదా రామకృష్ణుల అలౌకికమగు ప్రేమనుగూర్చి గారేమాయి ఇలా అంటూ రొకసారి. ఏబది గజాల దూరాన్న నివసిస్తూ నెలలతరబడి ఒకర్ని ఒకరు చూడని ఈవ్యక్తులిద్దరూ అఖండప్రేమానుబద్ధులు. ఓసారి అమ్మకి తలనొప్పిరాగా తన సన్నిహితుడగు రామ్‌లాల్‌ని చూచి పరమహంస ఎంతో ఆత్రుతతో "రామ్‌లాల్, ఆమె కెందుకు తలనొప్పివచ్చిన దోయ్" అని పదే పదే అడిగి ఆత్రుతచెందేరు. నేడు భార్య నెంతో ప్రేమిస్తున్నా ననుకొనే భర్తలలోకూడా ఎంతమందిలా చూడగలరు భార్యలని? కామినీ కాంచనాలని తృణప్రాయముగా వర్జించిన పరమహంస "తమ భార్యలయెడ ఇలా నడచుకోవాలి సుమా గృహస్థధర్మములో" అని మనకి తెల్పడానికే శారదాదేవికి నగలంటే ఇష్టమని తెలుసుకొని తనకి వచ్చే (దేవాలయంలోని ఫించను) డబ్బు లోంచి మూడువందల రూపాయలు తీసి చక్కని నగలను చేయించారు.

లోకంలో మాతృప్రేమ ఎంతటి మహనీయ త్యాగ బుద్ధికలదో తెలియచేస్తుంది యీ క్రింది విషయం. శ్రీ పరమహంస తనవద్ద నివసించుచున్న బాలశిష్యులకు రాత్రిపూట బహులఘువుగా భోజనం పెట్టాలని ఆదేశించారు. మాతృ రూపిణి అయిన శారద వడ్డిస్తున్నప్పుడు లఘువుగా భోజనం పెట్టడం ఎలాగ? ఆమె వారికి కడుపునిండా కుడవపెట్టేది.

అదిచూసిన పరమహంస "వాళ్ళ యోగమార్గానికి యిది ఆటంకం యిలా చేయవద్దు" అని ఆమెతో అంటారు. దాని కావిడ యిలా అంటుంది. "వారి శ్రేయస్సును నేను గమనిస్తూనే వుంటాను. వారి భోజనవిషయంలో ఏమి అనవద్దు. తన బిడ్డలు కడుపార భుజిస్తేగాని ఏతల్లి తృప్తిపడ"దని. ఆహా! ఏమి వాత్సల్యము.

శ్రీ రామకృష్ణునికివలెనే మాతృదేవికూడా ధనాన్ని నిరసించెడిది. ఓసారి రామకృష్ణుని శిష్యుడు లక్ష్మీనారాయణుడనువాడు ఆయన సపర్యలకు పదివేల రూపాయ లివ్వబోయాడు. పరమహంస నిరాకరిస్తూ బహుశా శారదని పరీక్షించడానికికాబోలు ఆమెకు అభ్యంతరం లేకపోతే ఆ ధనం ఆవిడ తీసుకోవచ్చన్నారు. కాని మాతృదేవి ఆయనకే పనికిరాని ధనము తనకి అనవసరం అని నిరాకరించారు. మహానుభావుల చరిత్ర లిట్టివేకదా!

మాతృదేవి అనేకసార్లు తన శిష్యురాలు నుద్దేశించి ఒకరిద్దరు పిల్లలు కలిగినంతనే బ్రహ్మచర్యం అవలంబించం డని, తుచ్ఛమైన పశుజీవనంయెడ వైరాగ్యం అవలంబించి పవిత్ర జీవనానికి కృషి చేయుమని సెలవిచ్చారు. భౌతికవాంఛాప్రభావం పూర్తిగా నిండియున్న మన సమాజములో మాతృదేవి వాక్కులు ప్రతివారు జ్ఞప్తియందు వుంచుకోతగ్గవి.

మాతృదేవి దక్షిణేశ్వరంలో గడిపిన పదమూడేళ్ళలో కూడా పుట్టింటివారికి సాయంచేయడానికి అనేకసార్లు జయరాం

బాటికి వెళ్ళేవారు. తండ్రి మరణింప తమ్ములు పసివారై యుండి తల్లి ఆర్థికదైన్యంచే బాధపడుతుండేది. తల్లి ప్రక్క ఇంటివారికి వడ్లు దంపేపని చేయపూనితే ఆ పనిలో తల్లికి యెంతో సాయపడి తానే ఆ పనులు ఎక్కువగా నిర్వహించేది. వివాహం అయి కాపరానికి వెళ్ళాక ఆడపిల్లకి పుట్టింటివారి కష్టసుఖాలతో నిమిత్తము లేదనుకోకుండా, ఆమె అత్తమామ లయెడ తన బాధ్యత యెంతో పుట్టింటివారియెడకూడా స్త్రీకి బాధ్యత అంతేసుమా అని లోకానికి తెలుపుకు చేస్తుంది, పుట్టింటివారియెడ చూపే అపార ప్రేమానురాగాలవల్ల.

ఇంక మాతృదేవి గృహకృత్యాలందు ఎంతనేర్పరో, ఎంతదయామయో అంతకు వేయిరెట్లు సాహసవంతురాలని యీ క్రింది సంఘటనవలన మనకి తెలుస్తుంది. ఓసారి ఆమె జయరాంబాటినుండి దక్షిణేశ్వరానికి కొలదిమంది పరివారంతో కాలినడకన బయలుదేరి వెళ్తోంది. దారిలో వారు కొన్ని అర ణ్యాలు దాటవలసివుంది చీకటివడకుండా. అక్కడ దొంగల భయం ఎక్కువ. నరబలులు జరుగుతాయి. రాత్రికాకముందే ఆ అరణ్యందాటి తారకేశ్వరం చేరాలని వడివడిగా అందరూ అడుగులు వేయసాగారు. మాతృదేవి అలసిపోయి వుండుటచే తొందరగా అడుగు వేయలేకపోయారు. తనకోసం తోటివారు ఆగి ఇబ్బంది పడడం ఇష్టంలేక మాతృదేవి వారిని త్వరగా వెళ్ళమని తాను వారిని తారకేశ్వరంలో కలుసుకుంటానని పంపివేశారు. కాని ఆమె ఎంత ప్రయత్నించినా రాత్రిఅయ్యే

సరికి అరణ్యమార్గంలో చిక్కడిపోయారు. ఇంతలో నల్లని కాటుకరంగులో పొడుగైన మనిషి ఒకడు భుజాన కర్రపుచ్చు కుని ఎదురుగా రావడం కనిపించింది. ఆతని వెనకాల మరెవరో కూడా వస్తున్నారు. ఆ భీకరవ్యక్తి "ఈ చీకటిలో ఎవరక్కడ తచ్చాడుతున్నది" అని భయంకరంగా కేకవేశాడు. ఆ మాట లకి ఓమూల భయంకల్గినా శారద ఎంతో ధైర్యం తెచ్చుకుని "తండ్రీ! నాతోటి ప్రయాణీకులు నన్నిక్కడ దిగవిడచి వెళ్లారు. ఈ చీకటిలో త్రోవతెలీక ఇలా తిరుగుతున్నాను. మీఅల్లుడు దక్షిణేశ్వరంలో కాళీకాలయంలో వున్నాడు. ఆయన్ని కలుసు కోడానికి వెళుతున్నాను. మీరందాకా నాకు సాయంవచ్చి దిగబెడితే ఆయన ఎంతో సంతోషిస్తా"రని ఎంతో పరిపూర్ణ విశ్వాసంతో సరళంగా ఆవిడ చెప్పారు. దానితో మాయా మర్మం ఎరుగని ఆమె సరళవర్తనాని కాదంపతుల మన స్సులు ప్రేమపూరితా లయ్యాయి. దానితో వారు తమ స్వంత కూతురిలా ఆమె నోదార్చి ఆవిడ డస్సియుండుట గమనించి ఆ రాత్రి ప్రయాణం చేయనీయక "తెలొ భోలొ" గ్రామంలో ఓ కొట్టుకు తీసుకెళ్లి కొన్ని భక్ష్యాలుకొని ఇచ్చారు. అంతే కాదు శారదాదేవికి తన బట్టలతోనే పక్క అమర్చి ఆ స్త్రీ రాత్రంతా ఆమెని జాగురూకతతో కాపాడింది.

మర్నాడు వారు తారకేశ్వరం చేర్చారామెను. తను క్రొత్తగా సంపాదించుకున్న ఆ తలితండ్రులను మాతృదేవి తన బంధువులకు పరిచయంచేసి వారెంత సాయంచేసారో ఎంతో

కృతజ్ఞతతో చెప్పారు. వారికి వీడ్కోలు పల్కుతున్నప్పుడు ఆమె ఎంతో విచారించి ఇలా అన్నారు. "తీరుబడి అయినపుడు దక్షిణేశ్వరానికివచ్చి తమని కల్సుకోమని."

జరిగిన ఈ సంఘటన విని పరమహంస వారియెడ నిజమైన అల్లునివలె ఆదరం చూపారు. ఒకప్పుడు దొంగలుగా వుండే ఆ దంపతు లిప్పుడు చాలా యోగ్యులుగా ప్రవర్తిస్తున్నారని శారదాదేవి వ్యాక్యానించ్చారు. చూశారా! అలనాటి వాల్మీకిని సప్తమహర్షులు మహాయోగ్యునిగా రూపొందించినట్లు మన శారదాదేవి ఈనాటి దొంగలదంపతులను సత్ప్రవర్తకులుగా రూపొందించారు. సత్వగుణ సంపన్నులయిన మహావ్యక్తులు తమ మాటలచే, చూపులచే ఎంతదుష్టులలోనైనా ధార్మికబుద్ధిని రేకెత్తించగలరు. అందుకే "సాధూనాం దర్శనం పుణ్యాం, స్పర్శనం పాపనాశనం" అన్నారు.

పరమహంస 1886 ఆగష్టు 16వ తేదీని అఖండ బ్రహ్మమందు ఐక్యం పొందారు. మాతృదేవి ఎంతో విలపించినా చివరికి ధైర్యం తెచ్చుకున్నారు జ్ఞానబలిమిని. అయితే ఆమె పునిస్త్రీ చిహ్నాలైన చేతి మురుగులను తీసివేయుచుండ శ్రీ పరమహంస ప్రత్యక్షమై 'నీవు చేస్తున్న పని ఏమిటి? నేను చనిపోలేదుసుమా! ఒక గదినుండి ఇంకో గదిలోకి వెళ్ళానంతే!" అన్నారు. ఆ సంఘటనతో మాతృదేవి యితరాభరణాలను తీసివేసినా వంగీయులకి పునిస్త్రీ చిహ్నాలైన మురుగులను సన్నని ఎర్రంచు చీరలను విడిచిపెట్టలేదు. నేడు

వితంతుస్త్రీకి సహగమన దురాచారం పోయినా అంతకన్నా ఎక్కువ శిక్షే అనదగు వితంతు వేషధారణ పోలేదు.

ఎంత బాలికయినా ఎంత వృద్ధురాలయినా, బొట్టూ, కాటుక పెట్టుకోకూడదు. గాజులు, పూలు ధరించరాదు. పనిమీద వెళ్తున్నవారికి ఆమె ఎదురుపడరాదు. ఆఖరికి ప్రొద్దున్న లేవగానే ఆ స్త్రీ తల్లి అయినాసరే చూస్తే ఏం అశుభం జరుగుతుందో అన్న భయమే. ఇంక శుభకార్యా లలో దూరదూరంగావుండి తిలకించవల్సిందే కాని అందులో చొరవగా పాల్గొనే అవకాశం లేదుకదా! నేటికీ సంఘస్థితి ఇలాగేవున్నది. శారదాదేవి పరమహంసలాంటి ఆధ్యాత్మిక జీవనులు. ఉత్తమ పురుషులు వారిచేతలద్వారా "వితంతు వైనా" స్త్రీ సౌభాగ్యంగా వుండడంలో ఏతప్పులేదని తెలియ పర్చారా అన్నట్టు ఈ విప్లవమార్గాన్ని ప్రబోధించారు లోకానికి.

శ్రీ పరమహంస తన నిర్యాణానంతరం పదిహేను రోజు లకు వారి ఆదేశం చొప్పున మాతృదేవి తన శిష్యులతో పుణ్యతీర్థాలను సందర్శించడానికి బయలుదేరారు. ఆమె అయోధ్య, బృందావనం దర్శించారు. బృందావనంలో రాధా రమణుని ఆలయాన్ని సందర్శించి ఆమె ఇలా అనుకొంటారు. "రాధారమణా! ఒరుల దోషాలు గమనించే దుర్గుణం నా హృదయంనుండి పెకలించివేయి. ఎప్పుడూ ఎవ్వరిని నేను నిందింపకుండ వుందునుగాక" అన్నారు ఆమె. రాజమహేంద్ర

వరము వచ్చి పవిత్ర గోదావరినదిలో స్నానము చేసారు. ఎంతమంది ఇలా భగవంతుడ్ని ప్రార్థిస్తారు? ఏవో ఇహ లోకపు కోరికలగురించి, అంతగా కాకపోతే పుణ్యలోకాల నిమ్మనో, ఇంకా ముందుకివెళ్లితే భక్తినిమ్మనో, మోక్షాన్ని మ్మనో కోరవచ్చును గాని ఇతరుల దోషాలు ఎన్నకుండా, ఒకరిని నిందించకుండా వుండాలని ఎవరు కోరుకుంటూరు. ఇటు వంటి ఎంతో మంచి గుణాలవల్లే మనకీ మహానీయులుకీ వుండే తేడా స్పష్టంగా కన్పిస్తుంది. తాను కోరిన కోరిక సిద్ధించిందా అన్నట్లు శారదాదేవి ఎన్నడు ఎవర్నీ నిందించడంగాని దోషా లెన్నడంగాని చేయలేదు.

ఈ విషయం మన మందరం బాగా జ్ఞప్తియందుంచు కోవాలి. ఎప్పుడూ తనని పొగడుకోవడం, ఎదుటివారిని దూషించడంలోనే మన జీవితకాలం అంతా గడిచిపోతుంది. ఎంతటి మహానీయులూ ఈగుణాన్ని తప్పించుకోలేకపోయారు. మన దేశంలో ఈ అవగుణం పోకపోతే ప్రగతి మార్గంలో నేడు పయనించడం చాలా కష్టం. మాతృదేవి ఆ తరువాత కామారి పుష్కరంలో ఒక ఏడాది గడిపి కలకత్తాకి వచ్చారు. 1909 సం॥మున శారదానందస్వామి కలకత్తాయందలి బాగ్ బజారువందు తల్లి నివసించుటకు "ఉద్బోధన కార్యాలయం" నెలకొల్పారు. మాతృదేవి 1893 సం॥ములో వారం రోజులు పంచాగ్ని మధ్యమందు తపస్సుకూడా ఒనరించారు. అలనాటి

మహాఋషులవలె ఆమె దివ్యసమాధిస్థితులను నిర్వికల్ప సమాధి స్థితిని పొందేవారు.

ఇంక స్వగృహవిషయంలో, దేనికైనా ప్రాప్తం వుండాలన్నట్టు లోకులందరూ మాతృదేవివల్ల మోక్షమార్గం పొందుతుండగా ఆమె సోదరులుమటుకు ఎంతసేపు డబ్బిమ్మనే ఆమెని అడిగేవారు. మాతృదేవి సోదరులలో ఒకరైన అభయచరణుడు మరణించుటచే అతని కోరికప్రకారం ఆతని పిచ్చి భార్య సురబాల, కూతురు రాధు సంరక్షణభారం ఆమె వహించాల్సి వచ్చింది. వారిరువురూ ఈమె నెన్నోవిధాల హింసించెడివారు. నిందించెడివారు. ఇంటిలోనిపోరు యింతింత కాదయా అన్నట్టు ఎంత విసిగించినా ఆమె ఎంతో సహనంతో వారిద్దర్నీ కాపాడారు. సృష్టిలో స్త్రీకి, పురుషుడికి, తల్లికి తండ్రికిఎంతో తేడా వుంది! ఎంత మహాత్మురాలయినా మాతృరూపిణి స్త్రీ గనుక శారదాదేవి తన త్యాగగుణంవల్ల ఇచ్ఛాపూర్వకంగానే ధార్మికబుద్ధితో ఇడుములు పడ్డారు, స్వజనులవల్ల. లోకంలో స్వగృహంలో కలహాలవల్ల బాధలు ఎంతవారైనా భరించక తప్పదుకదా! ఇది మనకు తెలియజేయడానికే అన్నట్టు మనలాంటివారు ఆమె పడిన ఇడుమలన్నీచూసి ఊరట తెచ్చుకోడానికే అన్నట్టు ఆమె తన వారివల్ల ఇబ్బందులు సహించారు. "రాధు"ని ఎంతో ప్రేమగా చూసిన ఆమె తన అంత్యదశలో ఆ మమకారాలను తెంచేసుకొని వారిని జయరాంబాటికి పంపేశారు. తన మనసు వారినుంచి మరల్చుకొన్నా

నని చెప్పారు. ఆమెకు శిష్యులంటే ఎంతమమతో అదివరకు రాధు పిల్లమీాద అలాంటి మమతవుండేది. ఇప్పుడు అంత నిర్మమత దెచ్చుకొనిననారు మాతృదేవి. అది వారివంటివారికే చెల్లునుకదా !

శ్రీ శారదాదేవినిగూర్చి వివేకానందు డిలా అంటారు ఓ సోదరుడితో. "సోదరా ! నే నమెరికా వెళ్లుటకుముందు అమ్మకి రాసినాను. ఆమె అనుమతి లభించింది. ఆమె ఆశీస్సులు ఫలించినవి. ఒక్క దుముకులో సముద్రుని దాటినాను చూశావా! ఆమె మహిమ"అంటూ. ఇంకా ఇలా అంటారు. "ముందు మాతృదేవికి ఆమె శిష్యురాండ్రకు మనం మఠం నిర్మించాలి. ఆ తరువాత పరమహంసకు (తండ్రికి). అతని పుత్రులకు తెల్సినదేకదా। తండ్రి కటాక్షంకంటె తల్లి కటాక్షం నాకు కోటి రెట్లు ఎక్కువ !" అని.

శారదామాయి ఓసారి ధ్యానం విషయంలో శిష్యునితో ఇలా అంటారు. "నాయనా రోజంతా జప ధ్యానాదులు చేయలేంకదా! ఊరకనేవున్న మనస్సు ఏదో గందరగోళం చేస్తుంది. కనుక నరేంద్రుడు నిష్కామకర్మ చేయుటకు అనువైన స్థలాలుగా రామకృష్ణమఠాలను స్థాపిస్తున్నాడు." అని. ఉదయ సాయంత్రాలు జపతపాలకి అనువైన వేళలు. సాధనకాహారనియమం అవసరం అని ఆచారంపేర చాదస్తం కూడదని ఆమె నొక్కి వక్కాణించారు. ఇంకా బాల్యంనుంచీ పూజలు తీర్థయాత్రలుచేస్తూ భగవద్భక్తి అలవరచుకోవాలని

ఆమె అన్నారు, మరియు అల్పవస్తులనుసయితం అలక్ష్యంచేయ రాదని మాతృదేవి చెప్తూ ఒకసారి శిష్యురాలు ఇల్లు తుడిచి చీపురు గిరాటువేస్తే "అదేంతల్లీ పని అవగానే చీపురుకట్ట అలా గిరాటేసేవు దాన్ని విసిరివేయుటకు నీకెంతసేపు పట్టునో, నీవు అక్కడ పెట్టడానికి అంతే టైము పట్టు"నని మందలించారు. పరమ పవిత్రమైన ఆమె దివ్యజీవితంలో యిటువంటి సద్బోధలు అడుగడునా కానవస్తాయి. ఒకసారి మాతృదేవిని తన శిష్యురాలు మంత్రసాని పని నేర్చుకోడానికి అనుమతి కోరగా తోటివారు దీనికి ఆక్షేపణ తెలిపారు. వెంటనే మాతృదేవి దీనిద్వారా ఎంతమందికో సహాయపడవచ్చునని అనుమతించారు.

ఎంతటి మహాత్ములకైనా మరణం సహజంకదా! 1920 సం॥ జూలై 20వ తేదీన మాతృదేవి అఖండ పరబ్రహ్మంలో లీనమయ్యారు. మనదేశంలో మొత్తం మూడు ఆలయాలు ఆమెపేర గలవు. అచ్చట నిత్యం పూజలు జరుపబడుచునవ్వి. జయరాంబాటిలో ఆమె పుట్టినచోట ఆశ్రమంతో కూడిన ఆమె ఆలయం ఒకటి నిర్మింపబడినది. ఇందు ఆమె నిలువెత్తు చిత్రపటం సజీవమై అలరారుతుంది. ఆ పవిత్రమూర్తినిచూస్తే "భగవన్మాతృభావమును లోకనమునకు ప్రకటించు నిమిత్తము గురుదేవుడు నన్ని ఇలలోవుంచి వెడలెనని" ఆవిడ అన్న మాట ఎంతో నిజం అని అనిపిస్తుంది. శ్రీ శారదాదేవి జీవితం మన ఎల్లరకు ఆదర్శప్రాయం. ఆమె చూపిన బాట ననుసరించి మనం శ్రేయోమార్గం పొందుదుము గాక!

# కవిత

ఈనాడు పూర్వంకన్నా రచయితల సంఖ్య హెచ్చు గానే ఉంది. కేవలం సంఖ్యాబలమేకాదు చాలామందిలో ప్రతిభా ఉన్నది. అయితే నేడు సాహిత్యప్రక్రియలలో వచన రచనకే ఎక్కువ ప్రాముఖ్యత ఇస్తున్నారు. కవిత, గేయం కూడా ఎక్కువగా ఆదరించ దగినవే. కథలూ, నవలలూ ఎన్ని చదివినా నోటను జ్ఞాపకం పెట్టుకోడం కష్టం. అవే పద్యాలయితే సులభంగా కంఠతాపట్టవచ్చు. అందుకే మన పెద్దలు ఓనాడు పిల్లలకు చిన్నతనంనుంచీ భారత, భాగవతా లలోని చక్కని పద్యములు, వాటి అర్థ, తాత్పర్యాలు తెలియ చెప్పేవారు. కాని ఈనాడు డిగ్రీలు పుచ్చుకున్న పెద్దలుకూడా తెలుగులోని ఈ పద్యాలకి చక్కగా అర్థంచెప్పడంగాని, చద వడంగాని చేయలేకపోతున్నారు. దీనికి కారణం మన భాష మీదున్న చిన్నచూపే. మన భాషలోని అందాలు ఆస్వా దించాకే ఇతర భాషలలోని గొప్పతనం తెలుసుకోటానికి ప్రయత్నించాలి. మనభాషను మనం బాగా అర్థంచేసుకోవా లంటే పదాల స్వరూపస్వభాలు తెలుసుకోవాలి. శబ్దమంజరి, అమరం, బాలవ్యాకరణంవంటి పుస్తకాలు చిన్నతనంలో చదువుకోవాలి. ఆ తరువాత కనీసం తెలుగులో పంచకావ్యా లైనా చదువుతే గాని భాషమీద ఆధిపత్యం రాదు. వీలున్న వారు సంస్కృతంలో పంచకావ్యాలుకూడా చదువుకోవచ్చు.

ఇలా కొంత ప్రతిభావ్యుత్పత్తులు సంపాదించుకున్నాక మనం రచనలుచేస్తే అవి రమణీయంగా ఉంటాయి. ముందుమాటలో మనం కవిత కీ నాడు స్థానం తక్కువగా ఉందనుకున్నాం కదా! అయితే అలాంటి కవితని వ్రాయడం నేర్చుకోవాలి. అంటే ఏయే పద్ధతు లవలంబించాలో తెలుసుకోవాలి? దీనిని గూర్చి సుప్రసిద్ధ కవి క్షేమేంద్రుడు ఇలా అంటారు.

ముందర కవి కాగోరువాడు కేవలం తర్కవ్యాకరణ పండితులైనవారివద్ద విద్య నభ్యసించకూడదు. సాహితీవేత్త దగ్గర చదువుకోవాలి. కవి కాగోరువానికి అనేకకథలు గాథలు, ఇతిహాస పురాణాదులతో పరిచయం వుండాలి. సంగీత పరిజ్ఞానము వుండాలి. చమత్కారం ఉండాలి. పూర్వకవుల గ్రంథాలు క్షుణ్ణంగా పఠించాలి. కవిత్వం ప్రారంభించేటప్పుడు బాగావ్రాయదగిన నేర్పుండదుకదా! అందుకని ముందర భావాన్ని పద్యాలలో ఇమడ్చడానికి ప్రయత్నించకు. భావం లేకపోయినా, ఛందశ్శాస్త్రాని కనుగుణంగా ఏదో పద్యా లల్లుతూ వుండాలి. ఇలా బాగావ్రాయటం అలవాటయ్యాక, తనదైన స్వతంత్ర మార్గంలో చక్కనిఅర్థం పదగుంభన వుండేలా పద్యం వ్రాయలంటూ, ఆయ నింకా ఇలా అన్నారు: "కవిత్వం సౌందర్యంతో అలంకారవంతమైనదంటే, శబ్దచమత్కారం రసగత సమత్కారం, అర్థ సమత్కారం వుండాలి. మరియు గుణదోషవిచక్షణ కల్గివుండాలి." ఇంతేకాక కవిత్వంలో తర్కం, వైద్యం, విజ్ఞానం ఇవన్నీ చూప

వచ్చునంటారు. ఆయన వృత్తతిలకము అను తన గ్రంథములో ఏ వృత్తంలో విసర్గములు శోభించునో, ఏ వృత్తంలో దీర్ఘాక్షరములు శోభించునో, ఏ రసానికే వృత్తం వాడదగునో చెప్పారు. మొదట వేగంగా నడచి, చివరకి నెమ్మదిగ నడిచి ప్రతిపాదానికీ, విరిగిపోవుట ద్రుతవిలంబిత వృత్తానికి శోభ అంటారు. ఉత్పలమాల, మత్తకోకిల, స్రగ్ధర, మహాస్రగ్ధర, భుజంగ విజృంభితము, వరాహము, వియోగినీ ఇలా పలురకాలైన ఛందస్సులను మహాకవులు కరుణ, విషాద, శోక, వీర, భయానక బీభత్సరసాలకి వాడారు. కాళిదాసు మందాక్రాంత వృత్తం మేఘసందేశంలో వాడారు. రఘువంశంలో అజవిలాపంలో వియోగినీవృత్తం వాడారు. ఇలావాటికి తగిన వృత్తాలలో చెప్పినందువల్ల రసపోషణ సహజంగానే కుదురుతుంది. నేడు ఇది ప్రతివారు గమనించాలి. అంతేకాదు కవితారచనకు కూడ పూనుకోవాలి. ముఖ్యంగా స్త్రీలుకూడా కవితలో ఎక్కువగా ప్రతిభ చూపాలి. దురదృష్టవశాత్తు ఈనాడు కవయిత్రుల సంఖ్య తక్కువగా ఉంది. ఓనాడు సంస్కృత భాషలో పురుషులతో సమానంగా కవనం చెప్పగలిగిన స్త్రీలు చాలమంది ఉండేవారు. వాడందరి గ్రంథాలు మన కీనాడు లభ్యంకాకపోయినా "విజ్జిక" అన్న కవయిత్రినిగూర్చి కావ్యమీమాంసకర్త రాజశేఖరుడు ఇలా అంటాడు: "కాళిదాసు తరువాత వైదర్భీరీతిలో కవిత్వం చెప్పడంలో ఆమె ముఖ్యురాలు" వైదర్భీరీతి కోమలంగా ఉంటుంది. శీలాదేవి కూడా

పాంచాలీరీతిని కవిత్వం చెప్పడంలో గొప్పప్రసిద్ధురాలని రాజ శేఖరుడు స్తుతిస్తారు. (పాంచాలీరీతి మిశ్రమంగా ఉంటుంది). అంతేకాదు ఆయనభార్య అవంతీసుందరి గొప్ప విదుషీమణి. ఆయన తన కావ్యమీమాంస గ్రంథములో, ఆమె అభిప్రా ప్రాయాలకు చాలా విలువ ఇచ్చినట్లు ఉల్లేఖించాడు. తరు వాత హాలశాతవాహానునికాలంలో గాథాసప్తశతిలో కొంత మంది స్త్రీ రచయితలు మనకు కడబడుచున్నారు. వారిలో కొందరు కవయిత్రు లున్నారు. అణులచ్చి, మాధవి, రేవ మొదలైనవారు. ఆ తరువాత చాలాకాలానికిగాని అంటే రెడ్డిరాజుల యుగంలోగాని కవయిత్రులు బయలుదేరలేదు. తెలుగులో ప్రథమ కవయిత్రి తాళ్ళపాక తిమ్మక్క అంటారు. ఈమె చాల సరసంగా కవిత్వం రాస్తారు. సుభద్రా కళ్యాణం వ్రాసారు. ఈ పద్యము ఎంత సొగసుగా చెప్పారో చూడండి. "నాగమల్లియు తీగ నవమల్లితీగ కలసి పెనగుచున్న కడు వింత జూపె."

ఇంక గేయకవిత కూడా మనకు క్రొత్తకాదు. జాన పదసాహిత్యంలో ఇవి పూర్వంనుంచి పాటుకొని ఉన్నాయి. వీటిలో కొన్నిటికి మాత్రాఛందస్సు, అంత్యప్రాస, అను ప్రాస పాటిస్తారు. వీటికి ఓ ఊపు, నడక ఉంటాయి. శ్రీశ్రీ "మరో ప్రపంచము పిలుస్తోం"దన్న గేయంలో ఒక ఊపులయ ఉంది. కవితలో రగడలు అని ఎనిమిది రకాలు. తెలుగులోని మాత్రాఛందస్సులో చేసిన ఏ రచనైనా ఏదో రగడభేదానికి

చేరుతుంది. గేయకవిత కూడ తక్కువనుకోడానికి వీలులేదు. అర్థవంతంగా అందంగా రాయగలిగినతే గేయం చాలా రమణీయంగా వుంటుంది.

శ్రీ బాలగంగాధర్ తిలక్ తన కవిత్వం గూర్చి ఇలా అంటారు. "త్యాగశక్తి, ప్రేమరక్తి, శాంతసూక్తి నా కళా కరవాల ధగద్ధగరవాలు; నా అక్షరాలు ప్రజాశక్తులు వహించే విజయ ఐరావతాలు; నా అక్షరాలు వెన్నెలలో ఆడుకునే అందమైన ఆడపిల్లలు." నిజమేకదా, ఈ వాక్యాలు! ఇలాంటి అందమైన గేయాలనీ, పద్యాలనీ అర్థం చేసుకుని ఆస్వాదించగల రసహృదయమే ఉంటే ఎన్ని బాధలున్నా ఈ సంసారంలో జీవితం, ఆనందమయంగానే ఉంటుంది. ఇప్పుడు అలాంటి కవితా రసాస్వాదన కొంత చేద్దాం. అలనాట శ్రీకృష్ణదేవరాయలవారు "దిరిసిన పూవుకన్న, మెత్తనగు కృతి రచియింపు పెద్దనా!" అని పెద్దనచేత తెలుగులో మహాప్రబంధం రాయించాడు. రాయలు నిండుసభలో కవిగండపెండేరాన్ని సంస్కృతాంధ్ర భాషల్లో సమానంగా కవనం చెప్పగలిగిన శక్తివున్నవారు తీసికోమన్నప్పుడు పెద్దన లేచి ఆ గండపెండేరాన్ని అందుకొని కవితని గూర్చి తెలుగున, సంస్కృతంలో ఆశువుగా దీర్ఘమైన మాలికను చెప్పాడు. కవిత యిలా వుండాలి అని అంటూ ఆయన "పూతమెఱుంగులుం బసరు పూపబెడంగులు జూపునట్టి వాకైతలు జగ్గువిగ్గు నెనగావలె గమ్మనగమ్మనన్ వలెన్" అని తెలుగులో నిర్వచించి, సంస్కృతంలో యిలా అన్నాడు. "భారతీవధూటీ... నూతన ఘల్లులాచరణ

నూపుర ఝూళ ఝుళంఝుళీ మరందరసం...రుచిరప్రసారము సారెసారెకున్" అన్నారు. ఆయన యిలా అనడమే కాదు. తా నన్నది యథార్థమని నిరూపించుకున్నట్టు ఆయన మనుచరిత్ర చదివినవారికి స్పష్టం అవుతుంది.

అందుకే మనుచరిత్రయందలి పద్యాలలో భారతీదేవి చరణనూపురధ్వనులు ఆమె వీణాగానం, మృదంగనిస్వనాలు, మనకి మనోహరంగా వినపడతాయి. ఆ తల్లి సాక్షాత్తు నృత్యం చేస్తున్నట్లే వుంటుందా పద్యాలనడక. మనుచరిత్రలో ఈ పద్యమే చూడండి. "అటఁ జని కాంచె భూమిసురు డంబర చుంబి శిరస్సరజ్ఝరీపటల మహుర్ముహు ర్లుఠదభంగతరంగ మృదంగనిస్స్వన...శీతశైలమున్" అంటాడు.

ఆయన కవిత్వం అంత అందమైనది గనకే "ఆంధ్ర కవితా పితామహ" అని రాయలచే పిలిపించుకోగల్గాడు; ఈనాటికీ మనందరిచేత సంస్తుతింప బడుతున్నాడు, పెద్దనార్యుడు. అలాగే ఆంధ్రభాషాయోష కపారసేవ చేసిన తంజావూరు రఘునాథ రాయలు తన వాల్మీకి చరిత్రనము కవితను గూర్చి పలికిన పలుకులు మనకు శిరోధార్యములు. ఆయన యిలా అంటారు.

"కప్పురంబులు గుప్పలుగా పోసినట్ల గుంకుమ పై పై గుప్పినక్రియ విరపొట్లము విప్పిన గతి" అంటూ కవితాపద్ధతిని తెలియపరుస్తారు. అలా రాస్తారుకూడాను. ఆయన వాల్మీకి చరిత్రలోని ఓ పద్యం చూద్దాం. "పంచిన లీల రాగము ప్రపంచితమై చెలగెన్ విపంచి ...... తనున్ నగించి ఎలయించిన" అంటూ బ్రహ్మను స్తుతించాడు. అలాగే సరసమైన మధుర

మైన భాషలో ఆనాడే సంక్షిప్తంగా రచనచేసి, సర్వులకీ అర్థమయేలా భాష వుండాలి; అని తెలియచెప్పిన మొల్లమాంబ కవితనుగూర్చి తన రామాయణంలో యిలా అంటుంది. "తేనె సోక నోరు తియ్యనగు రీతితోడ నర్థమెల్ల తోచకుండ గూఢ శబ్దమునుగూర్చిన కావ్యమ్ము మూగ చెవిటివారి ముచ్చటగును."

ఆమె తా నన్న మాటలను రామాయణంలో స్పష్ట పరచుకుంది కూడాను. ఈ పద్యంలో సాయంసంధ్యను ఎంత అందంగా మధురంగా వర్ణించిందో చూడండి.

"మేలిమి సంధ్యారాగము ౹వాలిన చీకటియు కలిసి వరుణునివంకన్, నీలము గెంపున నతికిన పోలిక చూపట్టె నభోమణి తలగన్" అంటూ సాయంసంధ్యారాగంలో అప్పుడే ౹వాలిన చీకట్లు నీలాలు కెంపులు రాశి పోసినట్లు మన కళ్ళ ముందు జిగేల్ మనిపిస్తుంది. ఇలా చెప్పుకుంటూ పోతే అందమైన అపారమైన కవితాసంపత్తిగల కావ్యాలు చాలా ఉన్నాయి; అన్నీ చదవలేకపోయినా కొన్ని తెలుగు కావ్యాలైన చదవగల్గితే భాషమీద పలుకుబడి, కవిత విని ఆనందించగల శక్తి వస్తుంది. ఆ కావ్యాలు, కవిత ఏనాటి కాలానివో అనుకోవడం సమంజసంకాదు. అంత ౹పాచీనకాలంనుంచీ ఈనాటిదాకా అవి నిలచివున్నా యంటే వాటిలో నూతనత్వం సజీవత లున్నాయనే తార్కాణం కదా! అందుకే పిన్నలనుండి పెద్దలదాకా ఆంౖధభాషలో మాధుర్యం ఆస్వాదించాలంటే, ౹పాచీనకాలంగురించి తెల్సుకోవాలంటే వచన౹గంథాలతోబాటు ౹పాచీన కావ్యాలనుకూడా ఆదరించాలి.

# సాహిత్యాస్వాదన

"ఈ ప్రపంచమొక పద్మవ్యూహం. కవిత్వ (సాహిత్యం) మొక తీరని దాహం" అన్నాడు మహాకవి శ్రీ శ్రీ. నిజమే! ఎంత చదివినా, ఎంత వ్రాసినా సాహిత్య పిపాస ఇంకా తీరదు. ఇంకా చదవవలసిం దెంతో ఉండిపోయిందని, వ్రాయవలసింది మిగిలిపోయిం దనిపిస్తుంది. న్యాయానికి రచనని లోతుగచదివి అర్థంచేసుకోడం, రచన చేయడం కూడా కొంచెం కష్టమైన పనే! రచయితకి స్వతహాగా ఉన్న ప్రతిభకి తోడు లోకానుశీలనము, అభ్యాసం ఉంటూ ఉండాలి. మనకి ముందున్న సాహిత్యాన్ని, సమకాలీన సాహిత్యాన్ని పరిశీలనదృష్టితో చదువుతూ ఉండాలి. కొంతమంది ఈ నడుస్తున్న సాహిత్యాన్ని అట్టే చదవరు; ముందున్న సాహిత్యాన్ని పట్టించుకోరు. ఇది రచయిత ప్రతిభని కుంటు పరుస్తుంది. సుప్రసిద్ధ రచయితలైన శ్రీ రాహుల్ సాంకృత్యాయన్, గోర్కీ వంటివారు ఎంతో పర్యటన చేసి, వివిధ ప్రజల మనస్తత్వాన్ని పరిశీలించి, అవసరం ఐతే వాళ్ళతో కలసి మెలసి తిరిగి రచనలు చేశారు. మన దేశంలోకన్నా పాశ్చాత్య దేశంలో రచయిత లెక్కువగా పర్యటనలు చేసి, ఆయా ప్రదేశాలలోని విశేషాలు తెలుసుకొని మరీ తమ రచనలు చేస్తారు. సమకాలీన సమస్యలను,

ప్రజల బాధలను, సమాజాభివృద్ధిని గమనించకుండ మన గదిలో మనమే కూర్చుని వ్రాసే రచనలు అంత శ్రేయస్కరం కాదు.

ఈనాడు నవలలకే ఎక్కువ ప్రాధాన్యం ఇస్తున్నారు. పత్రికలు, పబ్లిషర్స్ అయితే ఇవాళ వస్తున్న నవలల్లో ఎన్ని నిలుస్తాయో చెప్పడంకూడ కష్టమే! తెనుగు నవలా ప్రపంచంలో ఉత్తమమైనవిగా కీ॥ శే॥ శ్రీ బుచ్చిబాబుగారి 'చివరకు మిగిలేది' గోపీచంద్ గారి 'అసమర్థుని జీవితయాత్ర' రాచకొండ విశ్వనాథశాస్త్రిగారి 'అల్పజీవి' పేర్కొంటారు. అయితే ఈనాడు అటువంటి నవలలు సీరియల్‌గా వస్తే ఎన్ని పత్రికలు ప్రచురిస్తాయన్నదీ సందేహమే? పాఠకులు ఈనాడు ఆలోచించి, మనస్సుకి పని కల్పించే నవలలకన్న చకచక తేలికగా సాగిపోయే నవలలంటే ఆసక్తి చూపుతున్నట్లుగా కన్పిస్తోంది. మరి ఈ పరిణామం సాహిత్యానికి కానీ, ప్రజలకిగానీ మంచిదా?

నవలకన్నా కూడ, చిన్న కథ మంచి కథ వ్రాయడం కష్టమంటారు. అవును నిజమే! నవలకీ విస్తృతమైన కేన్వాస్ ఉంటుంది. మనం చెప్పదలచుకున్నదంతా చెప్పవచ్చు. కథకలాకాదు తక్కువ పేజీల్లోనే మనం చెప్పదలచుకున్న విషయము రావాలి. ఆ పరిధిలోనే భావం, శిల్పం అన్నీ కుదరాలి. మరి కథకు ముగింపు కూడా ఉత్సుకత కల్గించేలా ఉంటే బావుంటుంది.

ఇంక మరి వ్యాసాలు. నేను వస్తున్న వచన కవిత్వాం కూడా మంచివి వ్రాయాలంటే కష్టమే! ప్రసిద్ధులైన రాజకీయ నాయకులు, ఇంకా ఇతర పెద్దలు తమ గొప్ప వ్యాసాలవల్లే ప్రజాహృదయంలో చోటు సంపాదించి సూటిగా చొచ్చుకు పోగల్గినారు. వ్యాసం ఎత్తుగడలోనే మనని ఆకర్షిస్తారు వారు. ఎక్కడా విసుగు పుట్టించకుండా చివరికంటూ ఒక మంచి కథ లాగా చదివించే నేర్పు గొప్ప వ్యాసకర్తల కుంటుంది. మనకు తెలియని ఎన్నో మంచి విషయాలు, మంచి పుస్తకాల్లోని ఎన్నో సంగతులు అందులో దొరుకుతాయి. ఇటువంటి వ్యాసాలు పత్రికల్లోని చింపి కలకాలం దాచుకోవలసినవిగ కూడ కొన్ని వుంటాయి. నేను దురదృష్టం కొద్దీ తెలుగు వ్యాససంపుటాలకి కూడ గిరాకీ తక్కువగానే ఉంది. రేడియోల్లోగానీ, వివిధ పత్రికల్లో పూర్వం వచ్చిన, ఇప్పుడు వస్తున్న మంచి వ్యాసాలను పుస్తకంగా ఎవరైనా ప్రచురిస్తే బావుంటుం దనిపిస్తుంది నాకు. సాహిత్యం గురించి గానీ, రచనని గురించి గానీ వ్యాసాలు పేపర్లలో తక్కువగానే వస్తాయి. అవి ప్రచురించేవారు, వ్రాసే వారుకూడ తక్కువే! ఈ వ్యాసాలు వర్ధమానరచయితలకు కూడ చాలా ప్రయోజనకారిగ ఉంటాయి.

ఆ మధ్య కొన్నాళ్లు వచన కవిత్వానికి చాలా ప్రాచుర్యం వచ్చినా, ఈవేళ పేపర్లలో కవితలు ప్రచురించడం చాలా తక్కువైపోయింది. న్యాయానికి మంచి కవిత్వాం

వ్రాయడం చాలా కష్టం! వచన కవిత్వం అనగానే అదేదో చాల సులభం అనీ, పదిలైన్లు పేర్చేస్తే వచనకవిత అవుతుందని కొంతమంది అనుకుంటారు. ఇది చాలా తప్పొటూహా. కర్త క్రియలను వెనక, ముందు పేర్చడంగానీ ఏవో గారడీ మాట, కర్మలను అటూ, ఇటూ వాడడంగానీ కవిత్వం అనిపించుకోదు. పాఠకులకి అర్థం అవని, వాడుకలో లేని భాషంతా ఉపయోగించి కఠినమైన పదాలు ఎక్కువగా వాడినా అదీ కవిత్వం కాదు. వచనకవిత్వంలో భాష సరళంగా ఉండి, శైలి అందంగా ఉండి, పాఠకుల మనసులోకి భావం సూటిగా చొచ్చుకుపోయేలా ఉండాలి. సమకాలీన సమస్యలను, అభ్యుదయ సమాజాన్ని ఇతివృత్తంగా తీసుకుంటోంది. నేటి వచన కవిత, అసలు మంచి రచలన్నింటికి కూడ రచయితలో ఆవేదన, తపన, భావోద్వేగం ఉండాలి. కవితలో ఇవి మరికొంత ఎక్కువగ ఉండాలనిపిస్తుంది. కవిత మన అంతరాలలోంచి ఎంతో ఉద్వేగంతో పొంగి పొరలాలి. తగ్గ లయ ఉండాలి భావం క్రమబద్ధమై ఉండాలి. భాష కుదరాలి. కవితలో అక్కడక్కడ వాడే అంత్యప్రాసలు, అనుప్రాసలు కూడ శ్రవణ సుభగత్వాన్ని కల్గిస్తాయి. అయితే అందం పేరిట ఎక్కువగ ప్రాసలు వాడినా కవిత్వం దెబ్బతింటుంది. కవితలోని ప్రతిలైను నిగ్గుతేరి, భావస్ఫోరకంగా ఉండాలి. వచనకవిత్వం కదా అని ప్రోజ్ వ్రాసేయకూడదు. కవిత్వం వ్రాసాక చదివి చూసుకుంటే మనకే అందులో లయ ఉన్నదీ లేనిదీ తెలుస్తుంది.

అందమైన కవిత, ఆర్ద్రమైన కవిత నిరుపమానమైన శైలి, ప్రతి లైను ఆకర్షణతో చదివించే నేర్పు సుప్రసిద్ధకవులు స్వర్గీయ బాల గంగాధర తిలక్ కి ఉంది. 'అమృతం కురిసిన రాత్రి' ఎన్నిసార్లు చదివినా తనివితీరదు. తిలక్ లాంటి కవు లెప్పుడూ చాలా తక్కువమందే ఉంటారు. (కవిత ఎంత బాగా వ్రాస్తారో, కథలుకూడ అంతబాగా వ్రాస్తారు తిలక్). చావు పుట్టుకలమధ్య సంశేషంలాంటి జీవితంలో నలువైపులా అంధకారం. మంచిగంధంలా పరిమళించే మానవత్వం మా కున్న ఒకేఒక అలంకరణని అమృతం లాటిమాటని తిలక్ "అమృతం కురిసిన రాత్రి'లో చెప్పారు. తిలక్ అంత బాగా వ్రాయలేకపోయినా మనకున్న దాంట్లో శక్తివర చన లేకుండ మంచికవిత్వం వ్రాయడానికే కృషి చేయాలి. సుప్రసిద్ధ సంస్కృతపండితుడు కావ్యమీమాంస కర్త రాజశేఖరుడు ఇలా అంటాడు. "కవిత్వం వ్రాయకపోతే నిన్నెవరూ జైల్లో పెట్టరు. ఉరిశిక్ష అంతకన్నా వేయరు; కనుక వ్రాయదలుచుకుంటే మంచి కవిత్వం వ్రాయి. కుకవిత్వం మటుకు వ్రాయద్దు." అంటాడు.

ఏమైనా నిత్యం అనేక సమస్యలతో విసిగి వేసారి పోయిన మానవులకు సుఖానిచ్చేవి ఈ పనులలో రెండే రెండు. అవి సజ్జన సాంగత్యం, సాహిత్యరసాస్వాదన. పెద్దలు చెప్పిన ఈ వాక్యాలు ఆనాటికీ, ఏనాటికీ నిజం. మంచి సాహిత్యం సజ్జనసాంగత్యంకూడ మనస్సుని విశాల పరుస్తాయి; సంకుచితత్వం తొలగిస్తాయి; ఆనందాన్నిస్తాయి. అభ్యుద యాన్ని కల్గిస్తాయి.

# రచయితగా నా అనుభవాలు

చిన్నతనంనుంచీ నాకు యెక్కువగా మంచి పుస్తకాలుచదివే అలవాటున్నది. దాదాపు నాకు జ్ఞాపకం వున్నంతవరకు దేశ విదేశీ సాహిత్యాలలో నేను చదివిన మంచిగ్రంథాలు 100 ల సంఖ్యలో వున్నాయి. వీటిలో సాహిత్య గ్రంథాలే కాక ధర్మార్థ కామ మోక్ష సంబంధాలైన గ్రంథాలు వున్నాయి రచయితకి ప్రతిభ, వ్యుత్పత్తి, లోకపరిశీలనము, అభ్యాసము ఇవి ముఖ్యంగ వుండాలంటారు. ఇందులో ప్రతిభ సహజంగ. మనిషికి పుట్టుకతో కొంచెమైనా వుండాలి. తరువాత అతని స్వయంకృషివలన దానిని బాగావృద్ధి పొందించుకోవచ్చు. పెద్ద లైన సాహిత్యవేత్తల సాహచర్యంతో మంచి గ్రంథాల అధ్యయనంతో వ్యుత్పత్తిని పెంచుకోవచ్చు. రచయిత లోకాన్ని అందులోని వివిధ వ్యక్తులని బాగా పరిశీలించి, వివిధ వ్యక్తుల మనస్సులను బాగా ఆకళింపుచేసుకోవాలి. వీటన్నిటికీ తోడు నిరంతరం రచయిత ఎదుగుతూనే వుండాలి. ఎప్పుడూ విద్యార్థిలాగ సాహిత్యం ఇంకా నేర్చుకోవాలి అన్న తపన వుండాలి. కొన్ని రచనలు అచ్చు అయినంత మాత్రాన, కొద్దిమంది పొగిడినంత మాత్రాన, ఇంక నేను నేర్చుకోవలసిందేమీ లేదు, ఇంకా నేనేది రాసినా ఏదో పేపరు అచ్చు వేస్తుందని అను కొన్నా అది అతని పతనానికి నాంది. తరువాత యింట్లోవారు కూడ రచయితకి సహకరించాలి; అలా లేనిసాదున్న అత

సాహితీపిపాస వదలుకోలేక, రాయటానికి వీలుచిక్కక ఎంతో బాధపడతాడు. ఎంతో మంచి రచయితలను దేశం పోగొట్టుకుంటుంది. నేడు ఎందరో స్త్రీలు ప్రతిభా వ్యుత్పత్తులుండి కూడ సాధారణంగా భర్తలు ఇష్టపడక పోవుటచే వారియొక్క రచనాస్పృష్టిని తమలోనే యింకింప చేసుకుంటున్నారు. ఇది చాలా విచారింపదగిన విషయం. మా పుట్టింట్లో నాకు చదువుకోవటాన్కి, రాసుకోవటానికి ఏ అడ్డంకీ వుండేదికాదు. సుప్రసిద్ధ రచయితల, నిష్కళంక దేశసేవా సంఘసేవా పరాయణులైన శ్రీ॥ శే॥ రెబ్బాప్రగడ మందేశ్వరశర్మగారు మా తండ్రిగారు. ఆయనకి మామూలుగ ఆడవాళ్ళుగానీ, మగవాళ్ళుగానీ యింట్లో వూర్కే కబుర్లేసుకుని కూర్చోటము, పనిలేకపోయినా వీరింటికి వారింటికీ వెళ్ళడం యిలాంటివి యిష్టం వుండేవికావు. ప్రతి నిముషం మనిషి తనకైనా ఉపయోగపడాలి. సంఘానికైనా ఉపయోగపడాలిగానీ కాలాన్ని వృధా చెయ్యకూడ దనేవారు. అందుచేత చిన్నతనంనుంచీ మంచి కాలక్షేపాల్నే నేను యెక్కువ ఇష్టపడేదాన్ని. ఆయన వ్రాసిన ఎన్నో మంచి గ్రంథాల గురించీ, రాయబోయే ఎన్నో రచనలగురించీ ఎక్కువగా నాతోనే చర్చిస్తూ వుండేవారు. ఆంగ్ల, ఆంధ్ర, సంస్కృత భాషల్లో ఆయన మంచి ప్రతిభవున్న వ్యక్తి. ఆయన అనేక అర్థశాస్త్ర గ్రంథాలు, రాజకీయ గ్రంథాలు వ్రాసి మన దేశంలోని, ఇతర దేశాలలోని ప్రముఖుల మన్ననలను పొందేరు. సంస్కృత సాహిత్యాల

బాగా చదువుకున్నారు. మా సంభాషణలో గాంధీగారి దగ్గర నుంచీ, మార్క్సు, శంకరాచార్యులవరకు – ఆదిమకాలంలో భారతదేశంలో సామ్యవాదవ్యవస్థ ఎలా వుండేదీ దగ్గరనుంచీ ఐన్‌స్టీను సిద్ధాంతాలవరకు—కావ్యాలు, పురాణాలుగురించి యెన్నో చర్చలు జరుగుతుండేవి. అందుచే నా మనస్సు బాగా ఎదగడాని కవి యెంతో ఉపయోగపడేవి.

చిన్నతనాన్నే తలిదండ్రులు పిల్లలకు మంచి గ్రంథాల పట్ల ఆసక్తి కొలిపితే పెద్దవారయ్యాక రచనా మార్గంలో ప్రవేశించగలరు. దేశానికి, సంఘానికి ఉపయోగపడే వ్యక్తులు అవుతారు.

అప్పట్లో మా కొవ్వూరులో ఆడపిల్లలకి హైస్కూలు వేరే లేనందున, మా నాన్నగారు తీవ్ర జాతీయవాది అవడం వలన, ఆయనకి ఇంగ్లీషు భాషయందు వ్యామోహం లేక పోవడంచేత, థర్డ్‌ఫారమ్ పాసయ్యాక నా చదువు మాన్పించేశారు. ఈ జ్ఞానంతో ఇంటివద్దవుండి యెంతో చదువుకోవచ్చు అనేవారు. మరో ఏడాదిలో వివాహం జరిగి కాపురాని కెళ్ళి పోవడంతో నాకు ఏ చదువులు పెద్దగ చదివే అవకాశం లేక పోయింది.

మొట్టమొదట ఆంధ్ర వారపత్రికలో చల్లనిచూపు-చల్లని మాట అన్న వ్యాసం వ్రాశాను. "తలవెంట్రుకలకి, నరకానికి ముడి" అని వనితా లోకంలో నా రెండవ వ్యాసం వ్రాశాను. వితంతువులు జుట్టు తీయించుకోకపోతే వారి తల

వెంట్రుకల కొసలనుంచి ఎన్ని నీటిబొట్లుకారితే అన్ని వేల ఏళ్లు వారి భర్త నరకంలో ఉంటారని ప్రాచీనులు అనేవారు. ఈ విషయం తప్పని, వేదాలలో ఎక్కడాకూడ ప్రస్తావించలేదని ఆ వ్యాసంలో 'వనితాలోకం'లో రాశాను. అప్పట్నించి తెలుగులో వెలువడుతున్న చిన్న, పెద్ద పత్రికల్లో వ్యాసాలు, కథలు, గేయాలు, పద్యాలు, పుస్తకసమీక్షలు చేశాను. రెండు నవలలు రాశాను. నా అంతట నేనే ఆసక్తితో మా పుట్టింట్లో చదువుకునే సంస్కృత పాఠశాల విద్యార్థుల దగ్గర్నుంచి పుస్తకాలు తీసుకొని ఛందస్సులో పద్యాలు అల్లే దాన్ని. పద్యాలు వ్రాసిన మొదట్లో బలే తమాషాగావుండేది. కనబడిన ప్రతీ వస్తువుమీద వృత్తంలోనో, గీతంలోనో పద్యం రాయాలనిపించేది. అర్ధరాత్రి మెలుకువ వచ్చినా పద్యాలు అల్లుతూ కూర్చునేదాన్ని. నేను స్త్రీని అవటంవలన, పెద్దల చాటున వుండటంవలన మొదట్లో నాకు సాహిత్యంగూర్చి ఎక్కువగా పెద్దలవద్ద తెల్సుకోవాలన్నా, సాహితీ సభలకి వెళ్ళాలన్నా వీలయ్యేది కాదు. నాకున్న బుద్ధి నుపయోగించే నేను రాసి పేపర్లకి పంపుతూ వుండేదాన్ని. అవి అచ్చయ్యేవి కూడాను. ఆ తరువాత మేము కాకినాడ వచ్చాక ఎందరో పెద్దలైన సాహితీపరులవద్ద సాహిత్యసభల్లోను, విశేషించి మా 'సాహిత్యలహరి'లోను, ఎన్నో మంచివిషయాలు నేర్చుకున్నాను. ప్రాచీన సాహిత్యం గురించి ప్రాచీనులైన ముమ్మ

టుడు, ఆనందవర్ధనుడు, క్షేమేంద్రుడు వారందరూ సాహిత్యం గురించి ఏం చెప్పారో; విదేశీయ రచయిత లందరూ ఏం చెప్పారో చదువుకునేదాన్ని. సంస్కృతంలో కాళిదాసు కావ్యాలు, కొన్ని ప్రాచీన కావ్యాలు తెలుగులో చదువు కున్నాను. రేడియోలో వచ్చే సాహిత్యప్రోగ్రాంలు, వైజ్ఞా నిక విషయములు వినటం నాకు సరదా. తెలుగులో వెలు వడుతున్న అన్ని పత్రికలు నేను చదువుతాను. నా రచనల మీద నా ప్రభావమే గాని ఏ రచయిత ప్రభావమూ లేదు. పై విషయాలు ఎందుకు చెప్తున్నానంటే ఈనాడు రాస్తున్న కొంతమంది రచయితలు నేడు వస్తున్న సమకాలిక సాహిత్యం చదువరు. పూర్వ సాహిత్యం అసలే చదవరు. ఏవైనా మంచి సాహిత్యసభలు జరిగినా వెళ్ళరు.

వెళ్లినా అక్కడ సాహితీవేత్తలు, అమృత బిందువులే మన చెవుల్లో చిలకరిస్తున్నారా అన్నంత రమణీయంగా ఉప న్యాసం చెపుతున్నా పావుగంటకన్నా వినే ఓపిక లేక "బోరు బాబూ" అని పారిపోతారు.

అనారోగ్యంతో వున్నా ఇంట్లో, పిల్లలు పనిపాటలు ఎన్నివున్నా రచన వదల్లేను. సాహిత్యాన్ని నేను సరదాకోసం కాక ప్రాణంలా ప్రేమిస్తాను. అందుకే ఎన్ని కష్టాలకైనా ఓర్చి సాహిత్యం పెంపొందించుకున్నాను. సమాజంలో స్త్రీలకి జరుగుతున్న అనేక అన్యాయాలు నన్ను ఎక్కువగ కదిలించి వేస్తున్నాయి. అందుకని స్త్రీల సమస్యలమీద నేను ఎక్కువగ

అనేక వ్యాసాలు వ్రాసాను. నాకు మంచి గ్రంథాలన్నా, సాహితీ మిత్రులతో సాహిత్యవిషయాల్ని గూర్చి చర్చించడం అన్నా ఎంతో ఇష్టం. మంచి రచయితకి ఎవరికీ లభించనంత గౌరవం లభిస్తుంది సమాజంలో. అందుకే యిలా అన్నారు:

"కావ్యే యశసేఽర్థకృతే
వ్యవహారవిదే శివేతర క్షతయే
సద్యః పరనిర్వృతయే
కాంతాసమ్మిత తయోపదేశయుజే.

ఎందరో పెద్ద రచయితలు పాల్గొన్న సభల్లో పాల్గొనడం, కొన్ని సభల్లో అధ్యక్షురాలిగా వుండడం ఇవన్నీ మరువు రాని అనుభవాలు. కాకినాడ ఫీల్డ్ పబ్లిసిటీవారు, పబ్లిక్ రిలేషన్ ఆఫీసువారు జాతీయపండుగ దినాలప్పుడు కవిసమ్మేళనము ఏర్పరచి, మాచేత గేయాలువ్రాయించి సూర్యకళామందిరంలో పెద్ద సభ జరిపి మాకు పూలదండలువేసి, పూలతోను, తాంబూలంతోను, ధనంతోను సత్కరించినపుడు గేయాలు చదువుతుంటే ప్రేక్షకులు హర్షధ్వానాలు చేసినప్పుడు, ఇంత గౌరవానికి తగుదునా- అనిపిస్తున్నా మరోవైపు దివ్యానందం కలిగేది. మనం కొన్నాళ్ళకి కాలగర్భంలో కలసిపోయినా మన గ్రంథాలు నిలచియున్నంతవరకు మనం అమరులమే అవుతాము. వివిధ పేపర్లలో పడే ఎన్నో వైజ్ఞానిక విషయాలు, సాహితీ విషయాలు, గొప్పవ్యక్తుల జీవితపరిచయాలు, ఇలాంటివన్నీ కత్తిరించి నేను బైండ్ చేయించి దాచుకుంటాను. ఎన్నో మంచి గ్రంథాలు జాగ్రత్తపెడతాను. రచయిత సమాజాన్ని తీర్చిదిద్దగల్గిన వ్యక్తి. అందుకే అతను ఋషివంటివాడు అవాలని ప్రాచీను లన్నారు.

# మహామనిషి లెనిన్

[శ్రమజీవులకు క్రొత్తవెలుగు చూపిన మహర్షి కారల్ మార్క్సు ఆశయాల ననుసరించి రష్యాలో మొట్టమొదటి సోషలిస్టురాజ్యాన్ని స్థాపించిన లెనిన్ జీవితవిశేషాలు.]

## బాల్యయౌవనాలు :

వ్లదీమిార్ ఇల్యీచ్ 1870 ఏప్రిల్ 22 తేదీన వోలా తీర పట్టణమైన సిమ్ బీర్స్కులో జన్మించాడు. ఆయనకు పది హేనేళ్ళువచ్చేవరకూ అక్కడే ఉన్నాడు. 'ఇల్యీచ్' అసలుపేరు "ఉల్యానోవ్." ఆయనకున్న అసంఖ్యాకమైన మారుపేరులలో లెనిన్ నామమే జగత్ప్రసిద్ధ మైంది.

లెనిన్ 1893 లో రష్యారాజధాని సెయింట్ పీటర్స్ బర్గ్‌కు వెళ్ళి మార్క్సిస్టు సిద్ధాంతాలు ఆధారంగా అక్కడ కార్మికోద్యమాలు లేవదీశాడు. అంతేగాదు, వారిని ఆర్థిక, రాజకీయ పోరాటాలకి సిద్ధంచేశాడు. పీటర్స్‌బర్గ్‌లో నున్న కార్మికబృందా లన్నింటినీ 'కార్మికవర్గ విమోచనా సంఘం' అన్న పేరుతో సంఘటిక పరిచాడు. ఈ కృషి ఫలితంగా, 1905 జనవరిలో రష్యాలో ప్రథమంగా బూర్జువాప్రజాతంత్రవిప్లవం ప్రారంభం అయింది. ఎంతో పట్టుదలతో లెనిన్ ఈ విప్లవంలో పాల్గొన్నాడు. 1917 లో మళ్ళీ రెండవసారి, రష్యాలో విప్ల వం చెలరేగి నిరంకుశ జార్ ప్రభుత్వాన్ని కూలదోసింది.

ఆ విప్లవం జయప్రదమైనా, భూస్వాములూ, బూర్జువాలూ అధికారంలోకి వచ్చారు. కాని, లెనిన్ కార్మిక ప్రజల సహకారంతో వారిని కూలద్రోసి సమతా రాజ్యస్థాపనగావించాడు. దానితో గుత్తాధికారం, నిరంకుశపాలనా అంతరించి, దేశ సంపదకు ప్రజలే అధినేత లయ్యారు. ప్రపంచంలో ప్రథమంగా ఇలా సమతారాజ్యస్థాపన చేసిన మహావ్యక్తి, మార్క్సుకన్న కలలను నిజంచేసిన మహామనీషి, లెనిన్.

లెనిన్ కుటుంబం:

లెనిన్ తండ్రి ఇల్యానికొలా యెవిచ్. ఆయన ఒక పేద కుటుంబంలో పుట్టాడు. సమర్థుడైన ఉపాధ్యాయుడుగా పని చేశాడు. ఆయన సిమ్ బిర్క్సులో పనిచేస్తున్నప్పుడు, అక్కడి రైతులు నూటికి నూరుపాళ్ళు నిరక్షరాస్యులు. ఆయన ప్రయత్నం వలన అక్కడ పాఠశాలసంఖ్య 450 కి పెరిగింది. ఆయన తరచు పల్లెటూళ్ళకు వెళ్ళేవాడు. అందుకే లెనిన్ చిన్నతనంనుంచి తనతండ్రి చెప్పే గ్రామీణప్రజల జీవితకథలను చాల శ్రద్ధగా వినేవాడు. అంతేగాక, పల్లెటూళ్ళోనే పెరిగిన తల్లినుండీ దాదినుండీకూడా గ్రామీణప్రజల జీవిత కథలు ఆసక్తిగా వినేవాడు. ఫలితంగా లెనిన్ విప్లవాత్మక కార్యకలాపాలలో గ్రామీణ జీవితానికి ప్రాధాన్యత కలిగింది.

చిన్నతనంనుంచీ కూడా, లెనిన్‌కి గొప్ప పట్టుదల, ధీశక్తి ఉండేవి. ఆయన ఏదైనా వాగ్దానం చేశాడంటే, ఎంత

కష్టమైనా సెరవేర్చితీరేవాడు. చిన్నప్పుడు ఆయన సిగరెట్లు త్రాగుతుంటే తల్లిచూసి అది దురలవాటని మందలించింది. మానేస్తాననిమాట ఇచ్చాడు లెనిన్. అంతే, జీవితాంతం, ఆయన ఇక సిగరెట్టు ముట్టలేదు! లెనిన్ తలిదండ్రులకు ఆరుగురు సంతానం. ఆయన పెద్దన్న అలెక్సాండ్ర్ విప్లవకారుడు. ఆయన ప్రభావం లెనిన్‌పై చాలావుంది. తండ్రి అన్నల ప్రభావంతోపాటే, తల్లిప్రభావంకూడా ఆయనమీద ఎక్కువగా వుంది. తల్లి మంచి సంగీతవిద్వాంసురాలు, ఎంతో క్రమశిక్షణ కలది. కష్టించి పనిచేసేది. ఆదర్శగృహిణి, ఆమె సుగుణాలే పిల్లలకుకూడా చాలావరకు సంక్రమించాయి. తల్లి అంటే ఎంతోప్రేమ లెనిన్‌కి. చెల్లెలు ఓల్గా అన్నా చాలా ప్రేమ. వారిద్దరూకలసి మార్క్సిజం అధ్యయనం చేశారు. లెనిన్ అన్నగారు, అలెక్సాండ్ర్, అప్పటి రష్యాచక్రవర్తిని హత్యచేసే కుట్రలో ముఖ్యపాత్రవహించి అనుచరులతో అరెస్టయాడు. లెనిన్ తల్లి కొడుకును చూడడానికి వెళ్ళింది. "మిమ్మలని రక్షించమని కోర్టువారికి అర్జీ పెట్టుకొంటానని" అంది. కాని ధీరోదాత్తుడైన అలెక్సాండ్ర్ "అమ్మా! నీవు అలాంటి పనిచేయకు. అలా చేసినట్లైతే అది విప్లవానికి ద్రోహం అవుతుంది" అని జవాబిచ్చాడు. కొడుకుమాటలు విన్నాక, ఆమె ఏమీ బలవంతం చేయలేదు అర్జీపెడ్తానని. "ధైర్యంగా వుండునాయనా" అని కొడుకుని ముద్దాడి జైలు ఆవరణనుండి వచ్చేసింది. తరువాత, 'అలెక్సాండ్ర్‌ను' ఉరితీశారు,

మరికొంతకాలానికి 1899 లో, లెనిన్‌కు ప్రవాసశిక్ష విధించి గుబెర్నియాకు పంపనున్నారని విన్నది, లెనిన్ తల్లి. లెనిన్ దేశాంతరం పోయేందుకు అవకాశం యివ్వమనీ అలా కాకపోతే, రాజధానీ నగరానికి దగ్గరగా వుండేందుకు అనుమతించమనీ అడిగింది పోలీసు అధికారిని. పోలీసు అధికారి ఈసడింపుగా అన్నాడు. "మీ పిల్లలని చూసుకొని మీరు గర్వపడు తున్నట్టున్నారు! ఒకర్ని ఉరితీశారు. మరొకరికి ఉరికంభం దగ్గర పడుతోంది." దానికి లెనిన్ తల్లి "అవును! నేను నా పిల్లల్ని చూసుకొని గర్విస్తున్నాను". అని తీవిగా జవాబిచ్చింది గొప్పమనిషి-మనీషి!

లెనిన్ తన కుటుంబం వారికి వ్రాసిన లేఖలు అతని చెల్లెలు మరియు తర్వాత సేకరించి ప్రకటించింది. ఆ లేఖలను చూస్తే, ప్రతి పంక్తిలోనూ తల్లియందుండిన ప్రేమాభిమానాలు తొణికిస లాడుతుంటాయి. లెనిన్ మంచి విద్యావేత్త బహుభాషా కోవిదుడు. చాలాకాలం గ్రంథాలు అధ్యయనం చేయడంలోనే గడిపాడు. లెనిన్ గొప్ప గ్రంథకర్త కూడాను. సాంఘిక, రాజకీయాలను గురించి ఆయన ఎన్నో పుస్తకాలు వ్రాశాడు. అన్ని విధాలా అతనికి ఈడైన భార్య "ఎన్‌కె కృపయస్కయ." వారిద్దరూ ప్రేమించుకొని వివాహం చేసుకొన్నారు. అతని కార్యక్రమాలు అన్నింటిలోనూ ఆమె చేదోడు వాదోడుగా ఉండేది. నాలుగు దశాబ్దాలపాటు, రష్యాలోని శ్రామిక వర్గానికి ఆమె ఎంతో సేవచేసింది.

లెనిన్‌తోపాటు ప్రవాసజీవితం అనుభవించింది. దేశంలో సోషలిష్టు విద్యావిధానం ప్రవేశపెట్టడంలో ప్రముఖపాత్ర వహించింది. ఏ కార్యక్రమం తలపెట్టినా ముందుగా భార్యతో సంప్రదించేవాడు లెనిన్. ప్రఖ్యాత బ్రిటిషు రచయిత హెచ్. జి. వెల్స్ అంటాడు. "లెనిన్ నిర్మించిన పటిష్ఠమైన కమ్యూనిష్టు పార్టియే లేకపోయినట్లైతే రష్యన్ విప్లవం ఒక అనాగకరికపు సైనిక నిరంకుశత్వముగా పరిణమించి కూలిపోయి, సాంఘికంగా విఫలమై వుండేది. లెనిన్ మనస్సు ఎంత విప్లవాత్మక కార్యకలాపాలలో నిమగ్నమై వున్నా, క్షణంలో మళ్ళీ సాంఘిక పునర్నిర్మాణం వైపు మరలుతూవుండడం ఆశ్చర్యమే అనిపిస్తుంది. ఆయన రాజ్యాధికారం చేపట్టిన ఐదేళ్ళలోనే, 1924 లో ఆయన మరణించాడు. అయినా, ఈ స్వల్ప వ్యవధిలోనే, ఆయన అష్టకష్టాలను ఎదుర్కొని సోవియట్ రష్యాదేశాన్ని ఎంతో ముందుకు తీసుకెళ్ళాడు." లెనిన్‌కు ఆప్తమిత్రుడైన గోర్కీ అంటాడు! "ఆడంబరంలేని తత్వం లెనిన్‌ది. ఆయన మహామేధావి. విప్లవాత్మకమైన నిస్స్వార్థ శ్రామిక జీవితం ఆయనది." ఈవిధంగా లెనిన్ సోవియట్ రష్యాకేకాక ప్రగతిశీలురైన యావత్ ప్రపంచ ప్రజలకూ కూడా ప్రియతముడయారు.

### లెనిన్ - భారత దేశం:

1918 లో మొదటిసారిగా ఇద్దరు భారతీయ ప్రతినిధులు సోవియట్ యూనియన్‌కు వెళ్ళారు. నవంబరు 23వ తేదీన

క్రెమ్లిన్‌లో లెనిన్‌ని వారు కలుసుకున్నారు. భారతదేశ పరిస్థితి గురించి, యితర ప్రాచ్యదేశాల సంగతీ, వారు లెనిన్‌తో చర్చించారు. ఇంకావారు సోవియట్ అధ్యక్షుడైన 'వైయం స్వెర్‌డ్లోవ్‌కి ఒక విజ్ఞాపన సమర్పిస్తూ, "రష్యా విప్లవం భారత ప్రజలను ప్రభావితులను చేస్తోందనీ, స్వతంత్రులైన రష్యన్ సోదరులు భారతదేశవిముక్తికి ప్రపంచానికి సహాయం చేస్తారని ఆశిస్తున్నామనీ తెలియజేశారు." అని తర్వాత ఒక పత్రికాప్రకటనకూడా వెలువడింది.

మనదేశంలో మొదటిసారిగా లెనిన్ జీవితచరిత్రను మన తెలుగువారైన శ్రీ గోవిందరాజు వెంకటకృష్ణారావు గారు 1921 లో, ఆంగ్లభాషలో ప్రచురించారు. అందులో లెనిన్ గురించి వ్రాసిన మాటలు- గాంధీలాగే లెనిన్‌కూడా శాంతియుత పద్ధతులలో విప్లవాన్ని నడపడానికి ప్రయత్నించి చివరకు అనివార్యం అయినప్పుడే అంతర్యుద్ధానికి పిలుపు ఇచ్చారు. కావాలని దౌర్జన్యాన్ని పురికొల్పడం మహాదోష మన్నాడు లెనిన్. దౌర్జన్యాన్ని గాంధీజీ ఎంత ఏవగించుకుంటాడో, లెనిన్ కూడా అంతగానే ఏవగించుకుంటాడు. అయితే, నిరంకుశ ప్రభుత్వం దౌర్జన్య విధానాలకు దిగితే మాత్రం, తానుకూడా అట్టి పద్ధతులనే చేపట్టి విజయము సాధిస్తానని లెనిన్ చెప్పాడు! పీడితప్రజల విముక్తికోసంపోరాడిన లెనిన్, భారతదేశం గురించికూడా చాలా శ్రద్ధగా పరిశీ

లించారు. భారతదేశపు సాంఘిక, రాజకీయ, ఆర్థిక పరిస్థితులపై వెలువడిన గ్రంథాలను ఆయన అధ్యయనం చేశారు. భారతదేశ జాతీయ విమోచనాన్ని గూర్చి పత్రికలలో వచ్చే వార్తలను ఆయన శ్రద్ధతో చూసేవారు. భారతీయ తత్వశాస్త్రాన్నికూడా ఆయన బాగా ఆకళింపు చేసుకున్నాడు. 1908 లోనే భారతదేశాన్ని గురించి లెనిన్ యిలా అన్నారు: "భారతదేశంలో బ్రిటిషు ప్రభుత్వం సాగించే దుర్మార్గాలకీ దోపిడీలకీ అంతులేకుండా వుంది. బ్రిటన్ భారతదేశపు పరిశ్రమలను గొంతునులిమి అంతం చేస్తోంది" 1912 లో, మన దేశంలో స్వదేశీఉద్యమము ఆరంభమైనప్పుడు, "జాతీయ విమోచనకు ఒకవిధమైన జాగృతి ఈ ఉద్యమం" అని లెనిన్ వ్యాఖ్యానించాడు. లోకమాన్యతిలక్ ను అన్యాయంగా బ్రిటిషు ప్రభుత్వము నిర్బంధించినప్పుడు, తమ అసమ్మతిని బొంబాయి కార్మికులుచేసిన సమ్మెను లెనిన్ హృదయపూర్వకంగా అభినందించాడు. "భారతీయ ప్రజాస్వామికవాది" అని లోకమాన్యుని ఆయన ప్రశంసించాడు. "భారతదేశంలో కూడా శ్రామికవర్గం చైతన్యవంతమై రాజకీయ ప్రజాపోరాటం సాగించే స్థితికి అభివృద్ధి చెందింది. అందువల్ల జారు నిరంకుశపాలనను పోలిన బ్రిటిషు ప్రభుత్వంకూడా కూలిపోక తప్పదు." అని 1908 లోనే లెనిన్ ప్రకటించాడు. అంతక్రితం, 1905 లో రష్యన్ కార్మికులు సమ్మె జరుపుతున్న సందర్భంలో 'ఇండియన్ ఒపినియన్' అనే తమ పత్రికలో గాంధీజీ ఇలా వ్యాఖ్యా

నించారు- "రష్యన్ కార్మికులు సార్వత్రికసమ్మెను ప్రకటించి పనులన్నీ నిలిపివేశారు. తుపాకీలతో బెదిరించి ప్రజలతో పనులు చేయించడం అసంభవం. రష్యన్ ప్రజలు విజయం సాధిస్తే ఈ శతాబ్దంలో అది ఒక గొప్పసంఘటన అవుతుంది. మనంకూడా బ్రిటిషు ప్రభుత్వానికి వ్యతిరేకంగా ఈ పద్ధతిని అనుసరించవచ్చు."

గాంధీజీయే 1938 లో లెనిన్ గురించి వ్రాస్తూ "లెనిన్‌లాంటి మహాపురుషుల త్యాగాలతో పునీతమైన ఆశయాలు వృధాకాజాలవు" అన్నారు. నెహ్రూకూడా "లెనిన్ ఆదర్శంతో మేము ప్రభావితుల మయ్యాం" అన్నారు. 1919లో రాజా మహేంద్రప్రతాప్ తనని కల్సుకొన్నప్పుడు "మతం భారత ప్రజలను కాపాడదు. మీరు ప్రజలకు వర్గపోరాటం బోధించండి. దేశస్వాతంత్ర్య మార్గం దగ్గర పడుతుంది" అని హెచ్చరించాడు లెనిన్. గాంధీజీ రచనలంటే లెనిన్ చాలా ఇష్టపడేవాడు. వాటిని ఎంతో ఆసక్తితో చదివేవాడు.

స్త్రీలకు సమాన హక్కులకోసం, పెద్దపోరాటం కొనసాగించాడు లెనిన్. సామాన్య గృహిణికూడా రాజ్యాంగాన్ని నిర్వహించే రోజు రావాలని కలలు కన్నాడు. అన్ని వృత్తులకూ, పనులకూ చెందిన మహిళలు ప్రభుత్వ నిర్వహణలో పాల్గొనాలని ఆయన ఆకాంక్షించాడు. ఆయన ఆదేశానుసారం అక్టోబరు విప్లవంలో ఎందరో స్త్రీలు ప్రముఖపాత్ర వహించి పనిచేశారు. విప్లవ విజయానంతరం, లెనిన్ స్థాపి

యట్ మహిళలను యిలా ప్రశంసించారు. "మాస్కోలో, పెట్రోగ్రాడ్‌లో, తదితర నగరాలలో, పారిశ్రామిక కేంద్రాలలో, శ్రామిక వర్గీయ మహిళలు తమశక్తి సామర్థ్యాలను ప్రకటించి విప్లవంలో నిర్వహించిన పాత్ర చాలా గొప్పది. ఆ మహిళలే లేకపోతే మనకు గెలుపు ఉండేదికాదు. ఒక వేళ గెలిచినా, అది నామమాత్రంగానే ఉండేది."

ప్రపంచ చరిత్రలో లెనిన్ స్థానాన్ని నెహ్రూ చక్కగా అభివర్ణించాడు. "లెనిన్ చిరంజీవిగా వుండేది స్మృతి చిహ్నాలలోనూ, చిత్రాలలోనూ కాదు. ఆయన కృషితో ఉత్తేజితులై, మంచి రోజులకోసం ఎదురుచూసే కోట్లాది కార్మిక హృదయాలలో, ఆయన అమరుడుగా వుంటాడు." నిజమే! లెనిన్ అమరజీవి. ఆయన గొప్ప రాజకీయనాయకుడూ, విప్లవవాదే కాదు- సంగీత, సాహిత్యాలలో నిష్ణాతుడైన సంస్కృతీ పరుడుకూడా.

చి వ రి రో జు లు :

లెనిన్ కడసారిదినాలుగురించి ఆయనభార్య 'కృపస్కాయా' ఇలా వివరించారు. కొద్ది నెలలో మరణిస్తారనగా, సాధారణంగా సాయంత్రంవేళ, ఏవైనా నవలలూ, కవితలూ చదివి వినిపించమనేవారు. ఒకసారి, కవితను వింటూ కిటికీలోంచి అస్తంగత సూర్యునివైపు ఆలోచనగాచూస్తూ "కమ్యూనిస్టులు ఎన్నడూ ఖానిసల్లు కాలేరు." అన్నే ఆయన మాట

లతో కవిత ఆఖరయ్యేది......ఆయన ఇంక రెండు రోజులలో మరణిస్తారనగా జాక్ లండన్ వ్రాసిన "ప్రాణాల ప్రీతి" అనే కథను చదివి వినిపించాను. ఆ పుస్తకం ఇప్పుడు ఆయన గదిలో బల్లమీద వుంది. ఆ కథ చాలా శక్తివంతమైంది–ఆయనకు చాలా నచ్చింది. మర్నాడు, జాక్ లండన్ రాసిన మరో కథను చదవమన్నారు. అయితే, ఈకథ మొదట చదివినడానికి పూర్తిగా భిన్నంగావుండి, బూర్జువా సాహితిని బోధిస్తుంది, ఈకథ వింటూ లెనిన్ నవ్వి చెయ్యి ఊపారు, ఆపమని.

కారల్ మార్క్స్, ఫ్రెడ్రిక్ ఏంగెల్సుల విప్లవతత్వాన్ని సోవియట్ సోషలిస్టు సమాఖ్యగా అవతరింపజేసిన ప్రతిభాశాలి, యుగకర్త లెనిన్. ప్రపంచ చరిత్రలో ప్రవక్తలకోవని ప్రకాశిస్తూనే వుంటాడు నిత్యమై.

లె ని న్ సూ క్తు లు :

మానవజాతి సృష్టించిన సంపదలన్నింటి పరిజ్ఞానంతో బుద్ధిని సుసంపన్నం చేసుకొన్నప్పుడే కమ్యూనిస్టులు కాగలరు.

కళను ప్రజలకు సన్నిహితం చేయాలంటే ప్రజాసామాన్యం విద్యాసాంస్కృతిక ప్రమాణాలను పెంచడం అవసరం. కళ ప్రజలసొత్తు. అది ప్రజలలో బాగా వేళ్ళు పాతుకుని వారికి అర్థమయేలా వుండాలి. కళ వారిని ఉత్తేజితులను చేసి మేలుకొల్పాలి.

స్వయంశిక్షణ ఆరోగ్యవంతమైన స్పష్టమైన సోషలిస్టు ప్రపంచదృష్టిని అలవర్చుకోవడం, యువజన సంఘాల ప్రధాన లక్ష్యంగా వుండాలి.

అందరికోసం ఒకరు, ఒకరికోసం అందరూ అన్న సూత్రాన్ని శక్తినిబట్టి అవసరాన్నిబట్టి అనుభవం అను సూత్రాన్ని ప్రజాసామాన్యం మనసుల్లో పాదుకోల్పాలని అది వారి దైనందిన ప్రవర్తనావిధానంగా వుండాలని లెనిన్ అన్నారు.

ఉపాధ్యాయులకు చాలా ఉన్నతస్థానమివ్వాలని లెనిన్ అన్నారు. శ్రామికవర్గసంస్కృతి అన్నది ఎవరికీ తెలియకుండా ఏ లోకంనుంచీ వచ్చినదికాదు. శ్రామిక వర్గసంస్కృతి పెట్టుబడిదారి, భూస్వామిక సమాజికవ్యవస్థలోంచి మానవజాతి సముపార్జించిన విజ్ఞాననిధుల సహజపరిణామ ఫలితమే కావాలి.



# మనసులను మార్చగలిగిన మనీషి
# మాక్సిమ్ గోర్కీ

ఫోమాగార్డియేవ్‌ను సృజించిన మహాశిల్పికి జోహార్లు!

సాహిత్యం అంటే అనురాగము, మానవత్వం అంటే మమకారము ఉన్నవారెవ్వరైనా మాక్జిమ్ గోర్కీ గ్రంథాలను అమితాసక్తితో పఠిస్తారు.

గోర్కీ జన్మించినది నిరుపేద కుటుంబం. అతను పెద్ద చదువులేమీ చదువలేదు. గొప్పగొప్ప అంశాలను గురించి రాయడానికి తలబాదుకోనూలేదు. ఆయన తన కథలకి కావలసిన ఇతివృత్తాలను సామాన్యమానవులనుంచి స్వీకరించారు. వివిధవర్గాల ప్రజలను నిశితంగా పరిశీలించి ఏరుకొన్నారు. అందుకే అవి మనల నందరిని అలరిస్తాయి.

"ఫోమాగార్డియేవ్" (లేక Man who was afraid) అన్న ఈ పుస్తకాన్నిగూర్చి ప్రఖ్యాత అమెరికన్ రచయిత జాక్ లండన్ ఇలా అన్నారు: "ఇది ప్రతీఆలోచనాపరుడు చదివి తీరాల్సిన పుస్తకం. సమాజంలోని కల్మషాన్ని పృథఃకరించి విపులంగా మనకళ్ళ ఎదుట ఉంచుతుం దీ గ్రంథం. రంగు రంగుల ముసుగులను తొలగించి లోకంలోని శోకాన్ని ప్రదర్శిస్తుంది. మానవశ్రేయస్సుకు బాట చూపుతుంది. సమిష్టి జీవనంకోసం సమరోన్ముఖం చేస్తుంది."

అవును, అదంతా నిజమే! లోకంలో సిరి వుండివుంటే సుఖం శాంతి లభిస్తుందని చాలామంది భ్రమ. కాని ఈ కథా నాయకుడు- ఫోమాగార్డియేవ్ శ్రీమంతుల ఇంటిలోపుట్టి ఆ సంపదలలో ఆ సమాజంలో ఇమడలేక, అశాంతి పాలవుతాడు. నిజమైన శాంతిప్రదమైన మానవజీవికకోసం తపిస్తాడు. మానవతను సమూలంగా మంటగలుపుతున్న ఆనాటి సమాజాన్ని ఎదిరిస్తాడు. సమాజాన్ని దుయ్యబడతాడు. కానీ ఆ పోరాటంలో ఫోమా సమాజపు ఇనుప చక్రాలక్రింద పడి నలిగిపోతాడు. కానీ అతడు — వికృతమై క్షీణిస్తున్న ఆనాటి మానవతకి ఒక గొప్పజ్యోతి !

ఫోమాగార్డియేవ్ తండ్రి ఇగ్నాట్‌గార్డియేవ్. మంచి బలశాలి. అందగాడు. చాలా తెలివైనవాడు. ఈతనినిగూర్చి గోర్కీ ఇలాఅంటాడు: "అసలు కొందరు మనుష్యు లుంటారు. వారికి ఎప్పుడూ విజయమే. లక్ష్మి ఎప్పుడూ వారికి వెంటే ఉంటుంది. దానికి కారణం వారు సమర్థులవడం, కష్టించి పని చేయడం, వారిలో కొండంతశక్తి కోటకట్టుకొని ఉండటమే. ఎన్ని ఆపదలెదురైనా వారు అనుకొన్నది సాధించి తీరుతారు. ఈ జీవితపోరాటంలో అంతరాత్మ వారికి ఒకొక్కసారి ఎదురు తిరిగినా దానిని సులువుగా లొంగదీసుకొని బానిస చేసుకొంటారు. ఇదీ ఇగ్నాట్‌గార్డియేవ్ స్వభావం."

ఇగ్నాట్ తనలో ఉన్నశక్తిని ఆధారంగా చేసుకొని 40 ఏళ్ళు వచ్చేసరికి మూడు స్టీమర్లకి, పన్నెండు పడవలకి

యుజమాని అయ్యాడు. ఓల్గానది తీరమంతా అతనికీర్తి పాకి పోయింది. జనులు ధనానికి తెలివికి అతనిని మించినవారు లేరని పొగుడుతున్నారు. అతనికి రెండవభార్యవల్ల కలిగిన ఏకైక పుత్రసంతానము ఫోమా. ఫోమాను కనగానే అతని తల్లి నటాలియా మరణిస్తుంది. ఫోమాకి సంరక్షకుడిగా రక్షక పితగ తండ్రి యాగోవ్ మయికిన్‌ని నియమిస్తాడు. ఈ నవలలో మయికిన్ పాత్ర చాలవిశిష్టమైనది. సన్నగ పొట్టిగ ఉన్న మయికిన్ ముఖంలో ఆకుపచ్చని కళ్ళల్లో తెలివితేటలు ప్రతి బింబిస్తుంటాయి. వర్తకసంఘంలో మయికిన్‌కి చాలాపలుకు బడి గౌరవం ఉన్నాయి. మయికిన్ కుటుంబంతో కలసి ఫోమా ఆరేళ్లువచ్చేదాకా నివసించేడు.

కొంతకాలానికి ఇగ్నాట్ మరణిస్తాడు. తండ్రి మర ణంతో కలగిపోతాడు ఫోమా. మయికిన్ అప్పుడు చాలా గంభీరంగా ఉంటాడు. అతన్ని చూచి ఫోమా ఇలా అంటాడు: "నీకు మృత్యువును చూస్తే భయంలేదా?" అని. అప్పుడు మయికిన్ పాత్రకి అనుగుణమైన ఈ మాటల్ని ఎంతోచక్కగ పలికిస్తాడు గోర్కీ. "అబ్బాయి! నాకు బుద్ధిహీనత అంటే అన్నిటికన్నా ఎక్కువభయం. ఒక బుద్ధిహీనుడు తేనె తాగ మన్నా తాగకు. ఒక బుద్ధిమంతుడు నీకు విషం ఇచ్చినా సరే నిస్సందేహంగా తాగేయి" అని.

మయికిన్ ఫోమాని గడసరిగా లాభసాటి వర్తకుడిగా ఎన్నివిధాలచేయాలని ప్రయత్నించినా ఫోమా అమాయకు

డుగా వుండిపోతాడు. తోటివర్తకులతన్ని ఎందుకు పనికిరాని వాడని హేళనచేస్తారు. తనతోటి శ్రీమంతులను చూస్తే ఎందుకో భయం. ఎందుకో ఆకర్షణకూడా ఉండేది. కాని వాళ్లు ఒకర్ని ఒకరు మోసంచేసుకుంటూ డబ్బుకోసం ఎలాంటి పనులైనా చేస్తారని తెలుసుకున్నాడు ఫోమా.

అతనికి పందొమ్మిదేళ్లు వచ్చాయి. ఈతని స్థితిగ్రహించి మయికిన్ ఇలా అంటాడు: "వ్యాపారము ఒక యుద్ధంవంటిది, ఇందులో హోరా హోరీ పోట్లాడాలి. ఒక మనిషి వ్యాపారం మీద నీవద్ద కొచ్చాడంటే ఓచేతిలో తేనె చూపుతూనే రెండవచేతిలో చురకత్తి దాచివుంచాలి; లేకపోతే అయిదు కోపెక్కులుచేసే వస్తువును అరకోపెక్కు కేకొనాలని చూస్తారు" అంటాడు.

"ఇది మంచిపనికాదు. నాకు ఇలాంటివంటే ఇష్టంలేదు" అంటాడు ఫోమా. అతనికి జీవితంపై రానురాను విరక్తిఅధికం కాజొచ్చింది, అతనికి తన జీవితం నచ్చలేదు. ఆ వ్యధను మర్చిపోడానికి విపరీతంగా తాగేవాడు. ఉంపుడుకత్తెలను ఆశ్రయించేవాడు. తాగిన మైకంలో సమాజాన్ని అసహ్యించుకొంటూ గోలగోలగా అరచేవాడు. తనచుట్టూఉన్న మనుష్యుల నుద్దేశించి ఎలుగెత్తి ఇలా ఆక్రోశించేవాడు: "సోదరులారా! నేనర్థంచేసుకొన్న విషయాలివి. ఈ లోకంలో కొందరు మనుష్యులు పురుగులు; మరికొందరు పిచ్చుకలు. ఆ పిచ్చుకలే ఈ వర్తకులు. ఆ పురుగులను ముక్కులతో పొడు

చుకు తింటారు. అందుకే పీళ్లుపుట్టింది. మనం మూర్ఖంగా అనాలోచితంగా జీవిస్తున్నాము. అందుకే నేను దుఃఖిస్తున్నాను. నిజం నేను వట్టి అప్రయోజకుడ్నే" అంటూ బిగ్గరగా ఏడ్చేవాడు.

"నిజం నిజం రష్యన్ అంతరాత్మ పలికే ఈ వేద వాక్కులు అందరూ వినండి! గర్జించు గార్డియేవ్! గర్జించు" అంటూ అక్కడ ఉన్నవాళ్ళంతా అనేవాళ్లు.

చిన్నతనంనుంచి తల్లి నటాలియాలాగ సున్నితమైన ప్రకృతి. అతని తండ్రి ఫోమాప్రకృతినిచూచి విచారిస్తూండేవాడు. అతను చిన్నవాడుగా ఉండేటప్పుడు ఒకసారి తమ క్రింద పనిచేసే నావికుణ్ణి కొట్టడం చూశాడు. ఆరోజంతా ఫోమా అన్యమనస్కంగా, దిగులుగా ఉండిపోయాడు. అది చూసి తండ్రి ఇలా బోధిస్తాడు: "మనుష్యులపట్ల జాలిచూపడం మంచిదే. కాని మంచివాడు శక్తిసామర్థ్యాలు కలవాడు జాలి చూపబడాలి. బలహీనుడు, పనికిమాలినవాడు, ప్రతి దానిలో తప్పులు వెదుకుతూ నిరాశలో క్రుంగిపోయేవాడి మీద జాలిచూపకూడదు. జాలిపడి నీవు వాళ్ళకు సాయపడితే వాళ్ళు మరింత సోమరు లవుతారు. ఇతరులమీద ఆధారపడి జీవించేవాళ్లు పొట్టకోసం భగవన్నామం వుచ్చరిస్తూ తినడం తాగడం తప్ప ఇంకేమీ తెలియక ఆత్మను రోజురోజుకీ క్షీణింపచేస్తున్నవాళ్లు మనుష్యులుకారు. వట్టి నత్తగుల్లలు! నాయనా! బ్రతుకు తల్లివంటిదికాదు, మనల్ని వేధించి

ప్రాణాల్ని తీసే వెలయాలు లాంటిది. మంచివాళ్ళ సలహాలు వింటూ మన బుద్ధినికూడా పెరగనివ్వాలి” అని.

ఫోమా మొజేవ్ అనే విప్లవకవితో స్నేహంచేస్తాడు “మానవహక్కులలో ఉదాత్తమైన, ఒకే ఒక్క ఉన్నతమైన మాటుంది. అది అందరికి ప్రియమైనది. ఆమాటే స్వేచ్ఛ” అంటాడు. మొజేవ్ ఆ మాటలు విని “అద్భుతం! అద్భుతం!” అంటూ ఫోమా మొజేవ్‌ను గట్టిగా కౌగలించుకుంటాడు. ఈ పరిస్థితులలో ఒకనాడు తన రక్షకసితి మయికిన్ దగ్గరకు ఫోమా వచ్చి ఇలా అంటాడు– నన్ని సంపదల బరువునుంచీ కల్మషమైన వ్యాపారరంగంనుంచీ విముక్తిచెయ్యి! అని. “సరే అయితే ఇదంతా వదిలిపెట్టి సన్యాసులలో చేరతావా!” అని మయికిన్ రొక్కిస్తాడు. అతనింకా ఇలా అంటాడు. “ఆవిషయం తరువాత ఆలోచిద్దాంగానీ, మనతోటి వర్తకుడు ఇదిగో ఎఫిమోవిచ్ క్రొత్తస్టీమరు జలప్రవేశమహోత్సవం జరిపిస్తు న్నాడు. మన వర్తకులను ఆహ్వానించాడు. అక్కడ పెద్ద విందు జరుగుతుంది. నీవుకూడా రావాలి” అంటూ బలవంతం చేసి తీసుకువెడతాడు. వాళ్ళిద్దరూ స్టీమరు దగ్గరకు వెళ్ళేసరికి ప్రార్థన జరుగుతోంది. వర్తకులందరూ నిశ్చలంగా నిల్చు న్నారు. ముఖాలలో భక్తిశ్రద్ధలు తాండవిస్తున్నాయి. ప్రార్థ నలు చేస్తున్నారు. ఫోమాకి వాళ్ళనుచూస్తే నవ్వువచ్చింది. వాళ్ళందరి గురించి పూర్వం తాను విన్నసంగతులు జ్ఞాపకం వచ్చేయి. వాళ్ళలో ‘లుఫ్ రెజవిలోవ్’ ఉన్నాడు. అతను

పూర్వం ఓ సానికొంప పెట్టి నడుపుతుండేవాడు. దానితో సిరి ఎత్తుకుంది. పైగా ఒక శ్రీమంతుణ్ణి అతను చంపాడని వినికిడి, అంతేకాదు, ఒక కన్నెపిల్లను చెఱచిన నేరానికి ఇప్పటికీ అతనిపై కేసు విచారణ జరుగుతూనేవుంది. ఫోమా ప్రక్కనే "ఫాన్‌లిన్ గుశ్చిన్" నిలుచున్నాడు. వాడూ వర్తకుడే. ఒంటికన్ను పోడుచుకొచ్చినగూని పరమఅసహ్యంగా ఉంటాడు. తన పిచ్చితమ్ముని ఆస్తికాజేసి అతని భార్యాబిడ్డల్ని వీధులు పట్టించాడు. వాళ్లు బిచ్చగాళ్ళయి అలమటిస్తున్నారు. అలాంటి దుర్మార్గుడు గుశ్చిన్ ఆకాశంకేసి చూస్తూ బొవురుమంటున్నాడు. "ప్రభూ! నామీద నీ కోపాగ్నివర్షింపకు. నాకు నీ దయామృతం అనుగ్రహించు" అంటూ ప్రార్థిస్తున్నాడు. వర్తకులూ, పురోహితులు కలసి నావ జలప్రవేశోత్సవ సందర్భములో ప్రార్థనలు జరిపించాక విందులో పాల్గొన్నారు. వర్తకులందరూ మయికిన్‌ను ఉపన్యసించవలసినదిగా కోరారు. మయికిన్ గొంతు సవరించుకొని ఇలా మాట్లాడాడు.

"మహాశయులారా! వార్తాపత్రికలలో మన వర్తకుల గురించి నానా కారుకూతలు వ్రాస్తున్నారు. మనం సంస్కారం లేనివాళ్ళమట! అనాగరికులమట! అయితే సంస్కృతి అంటే నిజమైన అర్థం ఏమిటి? నేను చాలాకాలం పరిశోధించి ఓవిషయం కనుగొన్నాను. అది ఏమిటంటే సంస్కృతి అనే మాటకుపూజ అనిఅర్థం. అంటే జీవితవ్యవస్థపట్ల వ్యాపారంపట్లఎక్కువప్రేమనూ

రాగాలు వ్యక్తం చేయడమన్నమాట! అంటే వ్యాపారాన్ని ఎవడు ప్రేమిస్తాడో, తన విలువను, జీవితం విలువను తెలుసుకొని ఎవడు సరిగా ప్రవర్తిస్తాడో— అతడుత్తమసంస్కారి. మన సంస్కృతికి ఒక్క ఉదాహరణ చెప్తాను వినండి. బ్రహ్మాండమైన ఈ స్త్రీమర్లు, ఈ పడవలు, ఈ మేడలు ఇన్నీ ఎవరు కనిపెట్టారు? మనమే! ఇవన్నీ మనం మనశ్రమశక్తితో మేధాశక్తితో ఫలింపజేశాం! పేదలకోసం ఎన్నో దానధర్మాలు చేశాం. చర్చిలు కట్టాం, పెద్దపెద్దగుళ్లూ గోపురాలు నిర్మించాం. ఇన్నీ చేసింది ఎవరు? మనమేకదా! ప్రభుత్వానికి ఎక్కువ పన్ను చెల్లిస్తున్నదెవరు? మనమేకదా! కనుక మనమే మానవాభ్యుదయానికి పాటుపడే నిజమైన శ్రామికులం. అయినా వాళ్లు మనల్ని నిందుస్తున్నారు. నిందించనివ్వండి ఏంజేస్తాం!" అంటూ గంభీరంగా ఉపన్యసించాడు.

"మాకోవ్ మయికిన్ ఉపన్యాసం చాలా అద్భుతం" అంటూ అందరూ ఆతనిని కౌగలించుకొని అభినందించారు.

ఫోమా ఇదంతాచూసి ఆవేశం పట్టలేక పోతాడు. బిగ్గరగా ఇలా అంటాడు. "ఏమిట్రా? మీరు చేసింది! మీరు జీవితాన్ని నిర్మించారా? మీరు నిర్మించింది సంస్కృతికాదు; జీవితముకాదు. ఖైదు! మీరు మనిషికి సంకెళ్ళువేశారు. అక్కడ నిల్చున్న మనిషి ఊపిరాడక క్షీణించి పోతున్నాడు. మీరంతా హంతకులు, మానవజాతికి సహనం అనేది ఉన్నది

గనుకనే మీరంతా ఇంకా బ్రతికి ఉన్నారు. మిమ్మల్నసలు ఉరితీయాలి'' అంటూ ఫోమా.

అక్కడ ఉన్న వర్తకులందరి గుట్టు మట్లూ, దురన్యాయాలు ఎలుగెత్తి చాటుతాడు. వర్తకులందరూ కోపం పట్టలేక ఒక్కుమ్మడిగా అతనిమీదకురూకి బంధిస్తారు. ఆతని మతి చలించిందనిచెప్పి, వారందరూ కలసి ఆతనిని పిచ్చి ఆసుపత్రిలో పడేస్తారు.

ఆ తరువాత చాలాకాలానికి ఫోమాగార్డియేవ్ పిచ్చాసుపత్రినుంచి విడుదలయ్యాడు. దిగులుగా జాలిగొలిపే వెర్రి నవ్వుల్తో రోడ్ల మీద తిరుగుతూ కనిపిస్తాడు. ఆఖరికి అతను తనలో ఇలా అనుకుంటాడు "నేను గుడ్లగూబలా జీవితాన్ని చాలా దూరంనుంచి తీక్షణంగా చూచి గ్రుడ్డివాడనయ్యాను" అని.

ఆగర్భశ్రీమంతుడైన, ఫోమా జీవితంలో అన్యాయాల్ని ఎదిరించి పోరాడాడు. కాని ఈ ఒంటరిశక్తి సంఘంలోని దుష్టశక్తులముందు విజయం పొందలేకపోయింది. కాని లోకం అతన్ని చూసి విపరీతంగా భయపడింది. ఆ భయం తోనే అతన్ని పిరికివాడని, మతిలేని వాడని నిరూపించటానికి ప్రయత్నించింది. కాని నిజమాలోచిస్తే భయస్తులు మతిలేని వాడు, ఆనాటి సమాజికులే!

'ది మేన్ హూ వజ్ ఎఫ్రయిడ్' లేక ఫోమాగార్డియేవ్ అనే ఈ నవలలో గోర్కీ ఒక అద్భుతశిల్పం ప్రదర్శించాడు. ఋణధృవానికి చెందిన పాత్రను సృష్టిస్తూనే ఆనాటి సామాన్య మానవుని అంతరాత్మ ఆక్రోశాన్ని ప్రతిధ్వనింపజేశాడు. సమాజాన్ని అద్దుకోతకోసి సజీవమైన వాస్తవికతను ప్రదర్శించాడు. తన ఉత్తమమైన శిల్పంతో పాఠకులలో ఈ నవల ద్వారా ఒక మానవిప్లవాన్ని సాధిస్తాడు. కనుకనే గోర్కీ మానవుల మనసులను మార్చగల మహామనీషి. ఆతని కళాశక్తి అనన్యసామాన్యమైన సంకల్పసిద్ధి.

స్వర్గీయ గోపీచంద్ రచించిన ప్రఖ్యాత నవల "అసమర్థుని జీవయాత్ర" పై ఫోమాగార్డియేవ్ ప్రభావం పూర్తిగా వున్నదని నిస్సందేహంగా చెప్పవచ్చు.



# ఆదివాసులకు అరుణోదయం

"హూవార్డు ఫాస్టు రచించిన 'స్పార్టకస్' నవల చదువు తుంటే ఆనాటి బానిసవిధానము తల్చుకుని హృదయం భయంతో, భీతితో నిండిపోతుంది. సరే అది ఏనాటి మాటో అనుకుందాం. కాని ఈ శతాబ్దిలోకూడా మొన్న నిన్నటి దాకా కొండజాతి ప్రజలను ముఠాదారులు, వర్తకులు, అధి కారులు నిరంకుశముగా పీడించేవారు. ఈ కొండజాతి ప్రజల కోసం శ్రీ అల్లూరి సీతారామరాజు పోరాడి, అపారత్యాగం చేశారు. ఆ విషయా లిపుడు తెలుసుకుందాం!

బ్రిటిషుప్రభుత్వమువారు ఆ రోజులలో మన్యపు ప్రాంతానికి రహదారి వేయడం మొదలు పెట్టారు. ఆ రోడ్లు అజమాయిషి చేసే 'బాష్టియన్' అను దొర, కూలి చేసే మన్యప్రజలను చాల బాధలు పెట్టేవాడు. తానే కాక ముఠాదారులతో కలసి మన్యప్రజలను సకల హింసలు పెట్టే శ్రీ రాజుగారు ఈ స్థితంతా చూసి, మన్యప్రజ లందర్ని ఏకం చేశారు. పోరాటానికి గంటందొర, మల్లుదొర వీరికి సాయ పడ్డారు. శ్రీ రాజుగారు పల్లెలందు తిరిగి పంచాయితీలు ఏర్పాటుచేసి, మన్యప్రజలందరిచేత త్రాగుడు మాన్పించారు. కొందరికి సైనికశిక్షణ ఇచ్చారు. రాజు, ప్రభుత్వాన్ని కూల ద్రోయడానికి ప్రయత్నిస్తున్నాడని తహసిల్దార్ ప్రభుత్వము

నకు అర్జీ పంపాడు. అప్పుడు కొంతమంది సర్కార్ నౌకర్లు రామాలయములో వున్న రాజు దగ్గరకు వెళ్లి ప్రభుత్వము మీద తిరుగుబాటు మానేస్తే 30 ఎకరముల భూమి ఇస్తా రన్నారు. వారి మాటలకు రాజు లొంగలేదు. తహసిల్దారు దురంతాలు మిన్ను ముట్టుటచే కొండప్రజలు అందరు సమ్మె కట్టారు. విప్లవజ్వాలలు రేకెత్తినవి. బాస్టియన్ దౌర్జన్యం అరికట్టుటకు రాజు 22-9-1922 న చింతపల్లి పోలీసుస్టేషను మీదకు దాడి వెళ్లెను. అక్కడ ఉన్న తన ఖైదీలను విడిపించి ఆయుధసామాగ్రిని వశపర్చుకొనెను. పిమ్మట కృష్ణందేవిపేట స్టేషను, రాజవొమ్మంగి స్టేషను కొల్లగొట్టెను. అక్కడ అధి కారులు అతని కాళ్ళమీదపడి ప్రాణములు దక్కించుకొనిరి. రాజునకు సర్వదా 'గాం' సోదరులు సహాయులుగా ఉండిరి. రాజును పట్టుకొనుటకు 'త్రెమన్‌హార్' నాయకత్వము క్రింద సైన్యం బయలుదేరి విఫలులైరి. తర్వాత 'సాండర్స్' 'టాలర్డ్' అను ఇద్దరు ఆంగ్ల సేనాలు పట్టుకొనుటకు బయలుదేరిరి. కాని రాజు మూలానే చంపబడిరి. ఈ సందర్భంలో శ్రీ సీతారామ రాజుగారు జరిపిన 'గొరిల్లా' యుద్ధపద్ధతులు చాల అద్భుత మైనవి. రాజు పంపెడి 'మిరపకాయ టపా' చూసి బ్రిటిషు సైన్యం హడలిపోయేది. ఇందులో అడ్డతీగెల ముట్టడి చరిత్ర ప్రసిద్ధమైనది. పేరు చెప్పి ప్రతిస్టేషనూ కొల్లగొట్టాడు రాజు, కాని బ్రిటిషువారిని ఎవరిని అతడు అక్రమముగా చంపలేదు. రాజుగారు తమ ప్రక్కలో బల్లెముకాగా అతనిని పట్టి ఇచ్చిన

వారికి గొప్ప బహుమానము ఇస్తామని ప్రభుత్వము ప్రకటించింది. కాని ఆ ప్రయత్నము ఎవరూ చేయలేకపోయిరి. చివరకు వారి అనుచరులలో ఒకడైన అగ్గిరాజు మూలమున అంతఃకలహములు ఏర్పడినవి. మరల ఈ విప్లవాన్ని అణచుటకు 'రూథర్ ఫర్డ్' అను దొరను కలక్టరుగా నియమించిరి. ఈతడు చాల చండశాసనుడు. ఇతడు రాజుగారి అనుచరులను చాలమందిని పట్టుపెట్టెను. రాజుగారు దొరకకపోగా అతని ఉనికి చెప్పమని మన్యప్రజలను నానాబాధలు పెట్టెను. ఈ దృశ్యం చూడలేక రాజుగారు బ్రిటిషు ప్రభుత్వమునకు తానే పట్టుబడెనని ఒక కథ గలదు. ఏది ఏమైనా ఆయన 12-5-1924న వీరస్వర్గం అలంకరించినట్టుగా కొన్ని కథలద్వారా తెలియుచున్నది.

ఈ సందర్భంలో శ్రీ బాపూజీ అన్న వాక్యాలు మననం చేసుకోవడం చాల అవసరం. "శ్రీ రామరాజువంటి వీరులు అనేకమంది భారతదేశంలో పుట్టాలి." ఆంధ్రశ్రామిక ధర్మరాజ్యసభవారు విశాఖ జిల్లాలోని కృష్ణందేవిపేటలో గంటందొర దహన పవిత్రక్షేత్రమున 1950 లో వేదికను, శిలాశాసనమును నిర్మించిరి. ఇచ్చట శ్రీ రామరాజ శ్రామికకేంద్రంకూడా నెలకొల్పబడినది. ఇది కొండజాతివారి సేవ చేయాలని ప్రారంభింప బడినది. శ్రీ అల్లూరి సీతారామ రాజువంటి యోగిని, వీరుని కన్న భరతమాత, విశేషించి ఆంధ్రమాత ఎంతో ధన్యురాలు. ముందుగా కొండజాతి ప్రజ

లకు ఎంతో సాయపడ్డ శ్రీ అల్లూరి సీతారామరాజు గూర్చి తెల్సుకొన్నాము. ఇంక కొండజాతి ప్రజలకోసం ఎంతో శ్రమించిన కీ॥ శే॥ రెబ్బాప్రగడ మందేశ్వరశర్మగారి సేవా కార్యక్రమంగూర్చి తెల్సుకుందాం. శ్రీ శర్మగారు మా నాన్నగారు.

ఫిబ్రవరిలో 1942 లో నాన్నగారిచే ఆంధ్రగ్రామిక ధర్మరాజ్యసభ (గిరిజన సేవాసంఘం) స్థాపింపబడినది. ఆంధ్ర రాష్ట్ర జమీన్ రైతుసంఘ అధ్యక్షులుగా శర్మగారు (మాడు గుల జమీందారీలో చేరిన) విశాఖపట్టణము జిల్లాలోని పాడేరు, అరకు ఏజన్సీలలో సంచారం చేసేవారు. అప్పుడు అచ్చట కొండజాతిప్రజలలో కల అజ్ఞానం, దారిద్ర్యం, వెట్టి, గొత్తి పీడలుచూసి ఆయన హృదయము ద్రవించిపోయింది. అప్పటినుండి ఆయన తన జీవితాన్ని సంఘంలో అందరికంటె ఎక్కువ వెనుకబడియున్న కొండజాతివారి సేవలోనే గడుపు టకు నిశ్చయించారు. ఆయన అశక్తులయ్యు ఎన్నో మైళ్ళు కొండల్లో, అరణ్యాల్లో 'డోలీల' మీద ప్రయాణముచేసి, మాడుగుల ఏజన్సీలోని, ఇంకా మారుమూలలలో కొండజాతి ప్రజల ఇడుమలను స్వయముగా చూచిరి. వర్తకులు, భూస్వా ములు, బ్రిటిషు ప్రభుత్వ అధికారులు, కొండజాతి ప్రజలను నానా హింసలనుపెట్టి పశువుల కన్నా చాలా హీనంగా చూసేవారు. ముఠాదార్లు, వర్తకులు, గిరిజనుల పశువులను, పంటలను చాల అన్యాయంగా దోచుకొనేవారు. వాళ్ళకి కొద్ది

మూల్యంకూడా ముట్టడం చాల గగనమైపోయేది. ఇంక కొండవారి ధన, మాన, ప్రాణాలన్నీ ముఠావారి చేతులలోనే ఉండేవి వారిని ఎంత శారీరకంగా హింసించినా, హత్యచేసినా, ఇదేమన్న నాథుడు లేడు! ఇంకా దసరా మామూళ్లు మగ నాలికట్నాలు, రాజలాంఛనాలు పేరిట వారిని అమితముగా దోచుకొనేవారు.

ఇక ముఠాదార్లకి తరతరాలుగా వెట్టిచాకిరి చేయడమే గాక 'గొత్తి' అనే బానిసపద్ధతికూడా ఉండేది. వారు విద్యా విహీనులు, అమాయకులు అవడంనుంచి, ఇదేం అన్యాయమని ముఠాదార్లని ఎదిరించలేక పోయేవారు. తర్వాత నాన్నగారు చేసిన ఆందోళన ఫలితంగా 'గొత్తి' అన్న బానిసపద్ధతి 16-11-1939 తేదీన నెం. 5334/1939 ప్రభుత్వ ఆర్డరుద్వారా రద్దుచేయుబడినది. గాంధీజీ కూడా ఈ విషయం ప్రశంసిస్తూ 25-?-1939 హరిజన పత్రికలో వ్యాసం వ్రాశారు. ముందుగా వీరిని విద్యావంతులుగా చేయడం ముఖ్యమని కొందర్ని చురుకైనవారిని కొవ్వూరులోని మా ఇంటికి తీసుకొచ్చారు, నాన్నగారు. అల్లావచ్చినవారిలో ప్రముఖ గిరిజనసేవకుడు శ్రీ కంఠా గవరయ్య కుమార్డు శ్రీ కంఠా ముత్యాలు ఒకడు.

ఆ రోజు నాకింకా బాగా గుర్తు. రాత్రి 10 అవుతుంది. కాషాయిరంగు ముతకబట్టలు కట్టుకొని, మెళ్లో ఏవో తాయెత్తులు అవీ వ్రేళ్ళాడుతుండగా ఆ కుర్రాడు వచ్చి 'హాల్లో' ఉన్న మామధ్య కూర్చున్నాడు. (వీరిలో చాలమంది వళ్లేక్ మత

స్థులు) జైనులులాగా సూర్యాస్తమయితే భోజనం చేసేవారు కారు. సూర్యనమస్కారములుకూడా చేసేవారు. పలుకరిస్తే తెలుగులో యాసగా మాట్లాడేడు. అతనికి తెలుగు, లెక్కలు, ఇంగ్లీషు, చరిత్ర అవీ బోధించవలసిందిగా మా నాన్నగారు నన్ను, మా అన్నయ్యని ఆదేశించారు. నే నప్పుడు 5 తరగతి, అన్నయ్య 9 తరగతి చదువుతున్నాము. మాకన్నా పెద్ద వాడైన కుర్రాడు శిష్యుడుగా లభించడంతో మాలో కూడా గర్వం తలెత్తకపోలేదు. ఆనాటినుంచి ప్రతి ఏటా చాలమంది కొండవారు మా ఇంటిలో వుండి, నాన్నగారివద్ద శ్రీ K.V.N. అప్పారావుగారి వద్ద, ఊళ్ళోని ప్రముఖఅధ్యాపకులవద్ద చదువు కొని వెళ్ళేవారు. అలా వెళ్ళినవారిలో చాలమందిచే అక్కడ స్కూళ్లు స్థాపింపచేశారు, నాన్నగారు. చదువులలోనే కాక మద్యపాననిషేధము, నూలు వడుకుటలోకూడా కొండజాతి వారు అనతికాలములో గణుతికెక్కారు. 1942 నుంచి 1957 వరకు ఈ 15 సంవత్సరాలలో మాడుగుల ఏజన్సీలోని మారు మూలల్లోకూడా అక్షరాస్యత, తకిలీలు ప్రవేశించాయి. ఇంత త్వరగా వారు అభివృద్ధిచెందుటకు వారిలోని అమాయకత, పట్టుదలే కారణమని నాన్నగారు అనేవారు. 1941 లో భారతీయ ఆదిమజాతి సేవకసంఘస్థాపకులైన (శ్రీ) థక్కర్ బాపా గారు మాడుగుల ఏజన్సీలో నాన్నగారిచే ప్రారంభింపబడిన నిర్మాణకార్యక్రమము చూసి మెచ్చుకొన్నారు. అంతేకాదు. థక్కర్బాపాగారు 1942 లో వీరసంస్మరణ మందిరంలో

కొండజాతి సంఘకార్యాలయమునకు ప్రారంభోత్సవము జరిపిరి. 18-3-49 లో ఈ సంఘం ఢిల్లీలోని భారతీయ ఆదిమజాతి సేవకసంఘమునకు అనుబంధసంస్థగా చేర్చుకొనబడెను. అప్పటి నుండి కొద్దిగా గాంధీస్మారక నిధినుంచి ధనసహాయము ఈ సంస్థకు లభించెను. శ్రీ మల్రి కామయ్యగారనే గిరిజనుడు నాన్నగారికి సేవాకార్యక్రమములో చాలా సాయపడ్డారు. ఆయన ఏజన్సీప్రజలను కూడకట్టుకొని, "అక్రమవెట్టి గొత్తి, చెయ్యం, చెయ్యం! ముఠాదారి విధానం రద్దువాకాలి. అక్రమ ఫారెష్టు బాధలు తగ్గాలి!" అని నినాదాలు చేస్తూ, అహింసా పథం మీద 1936 నుంచి శ్రామికధర్మ సాధనసంఘంక్రింద దేశస్వాతంత్ర్యమును గూర్చి పాటుబడిరి.

ఇంక కొండలలో 1963-64 నాటికి 91 బడులు, 104 గురు ఉపాధ్యాయులచే నడుపబడినవి. ఇక్కడ చదువుకొన్న విద్యార్థినీ, విద్యార్థుల సంఖ్య 3 వేలు. ఇక్కడ టీచర్లు నెల సరి రిపోర్టులు కేంద్ర కార్యాలయమునకు సక్రమముగా పంపే వారు. ఈ బడులు ప్రధాన ప్రచారకులచే తరుచు తణిఖీ చేయ చుండెడివి. బడులు కొన్ని స్వంతపాకలలో, కొన్ని గ్రామస్థుల ఇళ్ళల్లో ఉండెడివి. ప్రభుత్వము వారు గ్రాంటు బాగా ఇచ్చే సంవత్సరాలలో నెలకి ఒక్కొక్క టీచరుకు 25, 30 రూ।లు లభించెడివి (నిజానికి వెల్లడిలోని టీచర్ల జీతానికి ఇది ఎంతో తక్కువ). ఇంకా ఇక్కడ గృహపరిశ్రమలు, చరఖామీద నూలు వడుకుట, టైలరింగ్ ఉన్నవి. మరియు ఇక్కడ ప్రధాన

ప్రచారకులచే సంతలలో, యాత్రాస్థలములలో, గ్రామాలలో సంవత్సరం పొడుగునా ఈక్రింది విషయాల నిరోధం మీద తీవ్రంగా ప్రచారం చేయబడేది. "గోహత్య, సురపానము, జూదం." ఇప్పుడు ఈ సంస్థలు బాగుగా పెరుగుటచే కేటాయించిన ధనం చాలుటలేదు. గిరిజన సంక్షేమ డైరెక్టరు వారిని ఈ సంస్థవారు ఇలా కోరిరి: "మా బడులుకు గ్రాంటు ఇవ్వలేని పక్షములో నడపడం చాలకష్టంగా ఉన్నది. కనుక మీరే వాటిని ఆధీనము లోనికి తీసికొని నడిపించమని దానికి వారు పాడేరు ఏజెన్సీలో సంచారముచేసి, ప్రస్తుత ఈ సంఘము వారు నడుపుచున్న 52 పాఠశాలలను భోజన సౌకర్యములతో 10 ఆశ్రమశాలలుగా చేస్తా మనిరి. ఈ సంఘ పక్షమున ఒక గిరిజన విద్యార్థి కొవ్వూరు సంస్కృత కళాశాలలో భాషా ప్రవీణ చదివాడు. మరో విద్యార్థి రాజమండ్రి ప్రభుత్వకళాశాలలో పి. యు. సి. చదివేడు. 1968 సం॥లో ఈ సంస్థ కార్యనిర్వాహకవర్గములో ఉన్నవారిలో కొందరి పేర్లు– శ్రీ కందర్ప వెంకటరామేశం, అధ్యక్షులు (బి.ఎ., బి.ఎల్.,); శ్రీ మల్లిపెద్ది కృష్ణమూర్తి, శ్రీ పాంగి రాముపొర, ఉపాధ్యక్షులు; శ్రీ కె. వెం. న్ర. అప్పారావు, కార్యదర్శి; సభ్యులు శ్రీ ఆర్. సీతారామచంద్రమూర్తి, ఎ. కె. పాత్రో, కం. మత్స్యాలు, స్వామి సత్యానంద తదితరులు.

చాల రోజులు ఈ సంస్థ పక్షాన "యుగధర్మ" అన్న పత్రిక కొండవారికోసం నడుపబడినది. ప్రస్తుతము విశాఖ

పట్టణంజిల్లా, చింతపల్లి ఏజెన్సీలో కూడా ఈ సంఘశాఖ 24-5-68న స్థాపించబడినది. దానిని బీహారు ఆదిమజాతి సేవా మండలి కార్యదర్శి "శ్రీ నారాయణజీ" ప్రారంభోత్సవము చేశారు. 3-8-68 న మన ముఖ్యమంత్రి శ్రీ కాసు బ్రహ్మా నందరెడ్డిగారు, గిరిజనసంక్షేమ శాఖామంత్రి శ్రీ శీలం సిద్దా రెడ్డిగారు చింతపల్లి వచ్చినప్పుడు ఈ సంఘంవారు విజ్ఞాపన పత్రములు సమర్పించిరి. ఏజన్సీ ప్రాంతంలో ఇంకా అభివృద్ధి సాధించవలసియున్నది. దానికి ముఖ్యమైన సాధనము విద్య. వీరికి ఒక ట్యుటోరియల్ కాలేజి నడుపుటకు ఈసంస్థ కార్యకర్త శ్రీ అప్పారావుగారికి ఉద్దేశ్యముగలదు. దీనికి నిస్వార్థముగా సేవచేసే వ్యక్తులు, సేవాసంస్థలు పూనుకోవాలి. ప్రభుత్వం వల్ల సహాయం విరివిగా లభ్యం అవ్వాలి. మరి ఆ శుభసమయము ఎప్పుడో!

మరియు సంస్థయొక్క ఆశయము లిలావున్నవి. మహాత్మాగాంధీ బోధించిన స్వరాజ్య సూత్రములు : శ్రామిక జీవనము, ధర్మకర్తృత్వము, ప్రజారాజ్యము గిరిజనులలో ప్రచారము చేయుట.

కొండజాతివారిలో ముఖ్యంగా వాళ్ళ స్త్రీలలో అజ్ఞానం మూఢాచారాలు నిర్మూలించుటకు ఒక పత్రిక, వారికి అర్థమయ్యేభాషలో నడపాలి. అసలు మన వెల్లడిప్రాంతములలోనే స్త్రీలలో నిరక్షరాస్యత అజ్ఞానము మూఢాచారాలు ఎక్కువ. అలాంటిది వేల సంవత్సరాలనుంచి సభ్యప్రపంచా

నికి దూరమై, నవీన ప్రపంచం, అందులోని మార్పులను చూడలేని కొండజాతి స్త్రీలలో మూఢాచారాలు ఎక్కువంటే ఆశ్చర్యపడక్కర్లేదు. వారికి గ్రామగ్రామాన ఆధునిక ప్రసూతి కేంద్రాలు లభ్య మవ్వాలి. గర్భిణిస్త్రీలు తీసుకోనవలసిన జాగ్రత్తలు, కుటుంబ నియంత్రణ, పిల్లల పెంపకం విషయంలో స్త్రీ కార్యకర్తలు వారికి తగు సలహాలు ఇస్తూండాలి. వారిలోని అశుభ్రత, అజ్ఞానాన్ని పోగొట్టాలి. మూఢాచారాల్ని నిర్మూలించాలి. ఇందుకు వారితో కలసి మెలసివుండి ఎంతో బాగా బోధన చేయగల స్త్రీలు వుండాలి. "అంటువ్యాధులకి, వ్యాధులకి దెయ్యాలు, చేతబడులు, దేవతలు కారణాలుకావని వారికి తెలియచెప్పి, వార్కి ప్రాథమిక ఆరోగ్యసూత్రాలు, ప్రాథమిక శరీర పరిజ్ఞానం కల్గించాలి." పఠనాలయాల, డాక్యుమెంటరీ చిత్రాలద్వారా వారిలో విజ్ఞాన ప్రచారం విరివిగా చేయాలి. స్త్రీ విజ్ఞానవంతురాలు కాకపోతే ఆ కుటుంబమంతా అజ్ఞానంలోనే పయనించవలసి వస్తుంది. కనుక వారి స్త్రీలని విజ్ఞానవంతులుగా చేయడం తక్షణ కర్తవ్యం. ఇంక చివరిగా ఓ మాట. ఈ కొండజాతివారి సేవా కార్యక్రమాలలో నాన్నగారి కుడిభుజంగావుండి ఈసంస్థ కార్యదర్శి అయిన, ఇప్పటికీ నాన్నగారు ఉంచిన కార్యభారాన్ని ద్విగుణీకృతోత్సాహంతో నిర్వహిస్తున్నారు, సోదరులు శ్రీ వెం. న్ర. అప్పారావుగారు ఎంతో ప్రశంసనీయులు. అలాగే ఇతర పెద్దలు, సేవకులు, కొండజాతి సలహా సంఘసభ్యులుగా వుండి వారికొలుకు ఎంతో

కృషిచేస్తున్న వారు మిక్కిలి ప్రసంసనీయులు అనుటలో సందేహము లేదు.

మా నాన్నగారు శ్రామికధర్మరాజ్య సిద్ధాంతమని, మార్క్స్, శంకర, గాంధీసిద్ధాంతంలు సమన్వయించేస్తు రూపొందించారు. ఆ సిద్ధాంతం శ్రీ రాధాకృష్ణన్‌వంటి ప్రముఖుల మన్ననలు బడసింది. కొవ్వూరులో కాంగ్రెసులోని మృత వీరుల సంస్మరణార్థం 'వీరసంస్మరణ మందిరం' అని నిర్మించారు. 'ఆంధ్రవీర సంస్మరణ కుసుమాంజలి' అని కాంగ్రెస్‌లో పనిచేసి చనిపోయిన మృతవీరుల జీవితచరిత్రలను ప్రకటించారు. ఇవేగాక "భారత వస్త్రపరిశ్రమల చరిత్ర", "నేటి భారతరాజ్యాంగము", "రాజ్యాంగ వివేకము" అన్న ప్రసిద్ధ గ్రంథములు వ్రాసిరి. శ్రామికధర్మరాజ్య వైజ్ఞానికసిద్ధాంత ప్రచారానికి కొండజాతివారి సేవకు ఇతర ప్రజోపయోగకర కార్యములకు కొన్ని లక్షలఖరీదుచేసే వారి ఆస్తినంతా దానం చేశారు.



# అభాగ్యభిక్షుకి

"ఆరిపోయిన కుంపటివిధాన కూచుందో ముసలది రోడ్డు వార" అంటాడు శ్రీ శ్రీ.

జాగ్రత్తగచూస్తే ఆ రోడ్డువారే ఎండి, శుష్కించిన స్తన్యాన్ని చంటివాడు పీకుతుంటే, చినుకులకు తడిసిన నాలుగు చితుకులు మంటపెట్టి, హోరుగాలిలో అంచుపగిలిన మట్టి కుండలో అన్నంవండుతున్న భిక్షుకికూడ మనకి కనిపిస్తుంది. ఒకోసారి వాళ్ళనిచూస్తే ఏ బాదరబందీ లేనివీళ్ళే మనకన్నా నిశ్చింతగ బ్రతుకుతున్నారని అనుకుంటాంకాని అది సరికాదు. ఆమె వండే ఆ పట్టెడుకూడు బిడ్డలకు పెట్టగా చివర కామె కెంత మిగులుతుందో చెప్పడం కష్టం. గర్భదరిద్రంలో వేలా డుతున్నా, ఎండిన డొక్కలతో ఆకలిబాధకు ప్రేవులు మెలి తిరిగి పోతున్నా, మాతృదేవత పిల్లలకోసము తన ఆకలి చంపుకుంటుంది. వారు తినగా మిగిలితేనే తింటుంది. తల్లి ప్రేమకు కులం, మతం, ధనిక, బీద తేడాలేదు. ఇంకోచోట చూస్తే శ్రావ్యమైనకంఠంతో, దీనముగ, దైన్యంగ గుండెలు పిండేస్తూ పాడుతూం దో భిక్షుకయువతి. మట్టిలో మాణి క్యంలా ప్రతిభవున్నా రాణింపులేని ఆ పాటవిలువ దయతలచి వేసినమ్మ గుప్పెడుబియ్యం. ఆమెకు సమాజంలో విలువలేదు. ఆమెకు పని దొరకదు. తిండి దొరకదు. తలక్రిందులుగ తపస్సు చేసినా కొంపా గోడు, జన్మలో అమరదు ఆ ముష్టిదానికి. ఆమెను పనిలో పెట్టుకుంటే ఏంపట్టుకుపోతుందో, ఎక్కడ

ఏంచేస్తుందో అని పెట్టుకునేవాళ్ళకి భయం. వీళ్ళకి ఓ ఊరు, ఓ దిక్కు, నా అన్నవాళ్లు వుండరు.

"నారాయణ, నారాయణ" అంటూ బానలాంటి (నెలలు నిండిన) పొట్టతో యిప్పుడా అప్పుడా అన్నట్లున్న ఓస్త్రీ మానంకప్పలేని చింకివస్త్రంతో బిచ్చానికి తరలివస్తుంది. ఓపిక లేకపోయినా, నడవలేకపోయినా మరోదారిలేక సిగ్గు వదలి, వీధి వీధికి తిరుగుతూ చూచేవారికి కరుణ, జుగుప్స రెండూ కల్గిస్తూ ఆమె బిచ్చం అడుగుతుంది. ఆ వెంటనే ఇంకో పచ్చిబాలింత వణికిపోతూ నిస్సత్తువతో డీలాపడ్డ కాళ్ళీడ్చుకుంటూ చేటలో కవలపిల్లల నుంచుకొని "అమ్మా అమ్మా ధర్మంతల్లీ చలి...వణుకమ్మా చింకిపాత పడేయం" డంటూ వస్తుంది.

ఈ తల్లులూ, అందరిలాగే ఈ సమాజంలోనే పుట్టారు. ఇందులోనే జీవిస్తున్నారు. జన్మతః వీరికన్నా మన మెందు లోనూ ఎక్కువకాము. రక్తమాంసములనుంచి శరీరావయ వాలవరకూ ఆశలు, కోర్కెలు, అనుభూతులు, ఆవేశాలు అన్నీ వారికీ మనకీ సమానమే! మాతృత్వభారం వహిస్తున్న ప్పుడు జీవిలోంచి, జీవి, సజీవమానవప్రాణి ఆ గర్భంకోసం లోంచి పుట్టుకొస్తున్నప్పుడు, పచ్చిబాలెంతగా మాసంముద్ద వంటి కళ్ళు తెరవని కన్నబిడ్డను పొత్తిళ్ళలో పెట్టుకున్నప్పుడు, అందరము పొందే వేదన, బాధ, అనుభూతి, సంతోషమూ అన్నీ ఒకటే! అయినా వీరికి ఎందుకా దయనీయస్థితి? వారి జీవితాలీసమాజంలో అలాగే ఎందుకు తెలవారిపోతున్నాయి?

ఇవన్నీ ఆలోచించి సత్వరం పరిష్కరించాల్సిన సమస్యలు. ఓ స్త్రీ యవ్వనం కంటికి నదురుగ కనిపిస్తే దిక్కులేని భిక్షుకి అయినా ఆమె మానాన్ని ఈ సమాజంలో విచ్చలవిడిగ తిరిగే, పులులూ, తోడేళ్ళు పీక్కుతినేస్తాయి. ఆసాంతం జుర్రుకుంటాయి. శరీరం కప్పుకోను సరైన గుడ్డలేక ఆ పిల్ల సిగ్గుతో చస్తుంటే మగరాయుళ్ళంతా కళ్ళతో ఆమెలోకి గుచ్చిగుచ్చి చూస్తారు. ప్రతీవాడికీ లోకువ. దిక్కులేనిఆమెకు గతి సంతానం. వీళ్ళు ఈసమాజంలో ముష్టివాళ్లుగానో, దొంగలుగానో తయారగుతారు. వాళ్ళకి చదువు సంస్కారం వచ్చే అవకాశాలుండవు. ఈ స్త్రీలు బలం, యవ్వనం పోయాక దారుణ వ్యాధులతో బాధపడుతూ, వికృతమైన ఆకారందాల్చి, పళ్లూడి, జుట్టురాలి చివరకి మళ్ళీ రోడ్డువార ముష్టెత్తుకోక తప్పదు. పని దొరకక తిండిలేక సమాజంచే ముష్టివాళ్ళగా తయారుచేయబడ్డవారే ముందర కరువు కాటకాలకి బలిఅయి రోడ్డువార ప్రాణాలు విడిచేవారు. ఒకోసారి ఒకోచోట వీరిలో డబ్బున్నవారిలో వున్నంత తల్లీబిడ్డల, భార్యాభర్తల అనుబంధాలు, అనురాగాలు కనిపించవు. కారణం వీరి జీవితమే నిరాశలో, నిస్పృహలో, దారిద్ర్యంలో వుండడమే. దుర్భరమైన కడుపుశోకంలోవున్న, ఆకలిబాధకోసం, ఆ విచారం మరచిపోయి, ఎక్కేగుమ్మం, దిగేగుమ్మంతో, చివాట్లు తింటు ముష్టెత్తుకోవలసిందే. రైళ్ళలో, వీధులలో, గుమ్మాలలో మనకె నిత్యం ఎదురయ్యే వీరిని సంస్కరించి, వృత్తి చూపి దారిలోకి తేవడం ప్రభుత్వం ప్రజల విధి కాదా?

# భావిభారత విధాతలు - బాలలు

మనం ఎక్కడికి వెళ్ళినా అది ఎంత పెద్దచోటైనా వర సగా రెండో మూడో ఈతచాపలను కప్పులుగా పరచుకొని చిన్న - బహుచిన్న గుడిసెలు వేసుకున్న భిక్షుకజనం రోడ్డువార కనిపిస్తారు. వారి పిల్లలో ధూళిదూసర శరీరాలు దయనీయ వదనాలతో, తైలసంస్కారంలేని కేశపాశాలతో ఏడాదినుంచి పదేళ్ళ వయస్సుగల వీరు మట్టిలో పొర్లుతూ ఆటలాడుతుం టారు. పైకి తీసుకువస్తే వీళ్ళలో ఎంతమంది గొప్ప మేధా విధాలుగా కవులు, డాక్టర్లు, ఇంజనీర్లు, రాజకీయనాయకులు వుతారో ఎవరుచెప్పగలరు? ఎన్ని మేలిరత్నాలు, ఎన్నె న్నో మణిపూసలు వెలికి వస్తాయో ఎవ రెరుగుదురు ?

చదువూ సంస్కారం లేకుండా ఘోరనిర్లక్ష్యానికి గురౌతున్న ఈ పిల్లలను ఎవరైనా పోషించి వీళ్ళగురించి విద్యా బుద్ధులు నేర్పిస్తే వీళ్లెలా వుంటారో చూడాలని......ప్చ్! అన్నీ ఎండమావులు! ఇందుకు దేశంలో ఎంతో ఇంకెంతో సమూలమైన మార్పురాలి. నేను ఓసారి వారి గుడెసెలలోకి వెళ్లాను; వారి పరిస్థితులను బాగా పరిశీలించాలని.

ఓ గుడిసెలో పాప ఏడ్పు వినిపిస్తుంది. అటు వెళ్లాను. పదినెలల పాపకి తల్లి గంజిలోవేసిన అన్నం తినిపించబోతూంది. తల్లిపాలరుచి మరిగిన ఆ పసిది ఆ గంజిమెతుకులు సయించక

ఉమ్మి గోల చేస్తోంది......దరిద్రపు దానా! నీకోసం పాలూ, బువ్వా ఎలా వస్తాయం? తింటావా? తినవా? తినవా- అని ప్రాణం విసిగిన తల్లి పిల్ల వీపుపై ఛెల్లున చరిచింది. మరోచోట ఓ పాప పదివేళ్ళడి గుడ్డితాతకు అసరా అయి కర్రపట్టుకొని నడిపిస్తూ వచ్చీరాని పాటలు పాడుతూ "అమ్మా ధర్మం" అని యాచిస్తు బయలు దేరింది.

మరోపాప గుడ్డితల్లిని, రోగిష్టి తండ్రిని పోషించటానికి —"మాదాకవళం తల్లీ" అంటూ యాచించడానికి బయలు దేరుతుంది. ఒంటరిగా, పొట్టకోసం ఏపూటా బయటకి వెళ్ళక తప్పని ఆ పసిదానికి చీకటబయం లేదు. ఆకలిముందు యే భీతీ వుండదేమో! ఎంత దుస్థితి!

కడుపుకోసం సకలభీతులు వదలి యీ పిల్లలు వర్షం లోనూ, చీకటిలోనూ తిరగక తప్పదు. పెద్దలు కష్టాలు పడ టంవేరు. జీవితంపై గంపెడాశతో నూతనంగ ప్రపంచంలోకి అడుగుపెట్టిన చిన్నారి పసిపాపలకి లోకం ఈవిధంగ స్వాగత మివ్వడం ఘోరం! ఇలాంటి దృశ్యాలుచూసి రోడ్డుమీద కొచ్చేసరికి ఓ మనిషి పిల్లా, పిల్లాడు ఎవరో మిఠాయికొట్టువద్ద హల్వాలు, కోవాలు కొంటుంటే ఆశగా, అకలిగా చూస్తూ చేయిజాపి, కడుపుచూపి "అమ్మా!" అని దీనంగా అడుక్కుం టున్నారు.

ఈ దేశపు ఈ బాలలకి, బాలికలకు, కొత్తగా ప్రపం చంలోకి వచ్చిన వీరికీ దుస్థితి ఎందుకొచ్చింది? ఏంపాపం

చేసారని సమాజం వారి నిలా తిండి పెట్టకుండా, మానావ, మానాలను చంపుకొని యాచించేలా చేసింది. ఏ సుఖమూ తెలియకుండా కఠినశిక్షలకు వీరిని బలిచేసింది. వీరందరికి బాగా జీవించే హక్కు లేదా?

పసిపాపలు రోగులు, వృద్ధులు స్త్రీలని విశేషించి ముందు చూడాలని మన ధర్మగ్రంథాలు చెబుతున్నాయి. మనం బాలలపండుగక్రింద "నెహ్రూ జన్మదినోత్సవం" ఏటేటా చేస్తూనే వున్నాం. ఆ పండుగ లక్ష్యం దేశంలో దిక్కు లేని నిరాశ్రయులైన బాలబాలికలకి భోజన, వసతి సదుపాయం కల్పించి విద్యాబుద్ధులు నేర్పించి సభ్యతగల మానవులుగ తయారుచేయడం కావద్దా? ఆ దినం ప్రతీ ఏడూ దేశంలోగల కోటానుకోట్ల అభాగ్యబాలల పురోభివృద్ధిని కోరటం కాదా?

ఈ ప్రపంచంలో పుట్టుకతోనే ముష్టివాళ్లుగా నిత్యదరిద్రులుగా ఎవరూ పుట్టరు. ప్రతీజీవి మాయామర్మం తెలియకుండా పుట్టెడు భవిష్యత్తుతో ఉజ్జ్వలజీవితం చేతబట్టుకి జన్మిస్తుంది. జన్మపరంగా అంతస్తులు, తేడాలు, అదృష్ట దురదృష్టాలు లేవు. అయినా లోకం అరలు, పొరలు, కత్తులబోనులూ విసరి, వాళ్ళ భవిష్యత్తును, జీవితంలోను ఉజ్జలత్వాన్ని ఉక్కు పిడికిలలో బిగించి పట్టుతుంది. కొందరిపై-కాదు అనేకులపై - పుట్టిన క్షణంనుండి కక్షగట్టి ఉచ్చువేసి నుదుటగీతలు చెరిపి కొత్తలిపిలో పిశాచశాసనం లభిస్తుంది. ఇంక వాళ్ళ బ్రతుకులంతే. వాళ్ళు ఎండి, మాడి బ్రతుకుతూ వుంటారు. వాళ్ళ

దేహాలు అరిగి, నురిగి పోతూవుంటాయి. వాళ్లు జీవించే ప్రతీ క్షణంలోనూ భయంకరంగా, దారుణంగా చచ్చిరాలిపోతునే వుంటారు. విరోధ వైరుధ్యసూత్రానికి వారి బ్రతుకులు మచ్చు తునకలు.

వీళ్లు తరతరాలుగా ముష్టివాళ్లు కారు. ఫ్యూడల్, పెట్టుబడిదారీ ఆర్థికవిధానాల తాకిడి ఫలితంగా వీరు క్రమంగా వృత్తులు, వ్యవసాయం హరించిపోయి, పనులు దొరక్క ఈ వృత్తికి సిద్ధపడుతుంటారు. చెదిరి, శిధిలమైన జీవితాలకు చెడిపోయిన బహుగు బ్రతుకులకి సమాజం అనివార్యంగా చూపే మార్గం యిది. మరి కొందరు పిల్లలకి ఏ బలీయమైన పరిస్థితుల్లో తండ్రి నేరాలుచేసి జైళ్ళకి వెళ్ళడమో తల్లులు పోయీ దిక్కులేనివారవుతారు. అంధత్వం, కుష్ఠు, మూర్ఛవంటి రోగాలు సంప్రాప్తించి, ఇలా ముష్టివాళ్ళవుతారు. కొందరు ముసలితనం, నాఅన్న దిక్కులేకపోవడం కారణంగానో ఈ వృత్తికి దిగుతారు. కారణాలేమైనా వారిని వెలుగులోకి తీసుకు రాగల్గిన బాధ్యత ప్రభుత్వానిది, ప్రజలదికూడా.



# "నిస్పృహపడి నూతులు గోతులు వెదకి లాభం లేదు- నిలిచి ప్రతిఘటిద్దాం సహనంతో సంఘర్షిద్దాం"

చరిత్ర మానవజాతి మనుగడ ప్రారంభం అయిన దగ్గరనుంచి మతాలు, యుద్ధాలుతోనే సంక్షుభితమైంది. ఆయుధబలం తక్కువయినవారిని శాంతయుతంగా బ్రతికే వారిని దీనికి విరుద్ధలక్షణాలు న్నవారు బందీలుగా కొనిపోయి బానిసలుగా అమ్మేవారు. జంతువులమీద చూపిన దయకూడ ఆ మానవులమీద చూపేవారుకాదు. దీనినే "స్పార్టకస్" అన్న నవలలో (బానిసల తిరుగుబాటును) హోవార్డుఫాస్టు చాల చక్కగా నిరూపించారు. ఇప్పటికీ ప్రపంచంలో ఆ నికృష్టమైన బానిసవిధానం "అదృశ్యమైనా" ఇంకోరకంగా దారుణమైన బానిసత్వం— ముఖ్యంగా స్త్రీల విషయంలో— అమలు జరుగుతోంది. అది మన దేశంలో మరీ యెక్కువ! అందుకే ఐక్యరాజ్యసమితి స్త్రీల కష్టనిష్టూరాలని గమనించి వారించేందుకు అంతర్జాతీయ మహిళాదశాబ్ది ప్రకటించింది. బానిసలను, మల్ల యుద్ధంపేరిట ఒకళ్ళ నొకళ్లు చావగొట్టుకోమని వాళ్ళ రక్తాలు కారుతో బాధతో అరుస్తూ చస్తూవుండే పాలకులైన ఉన్నతజాతులవారు కేరింతలు కొడుతూ ఆనందించేవారు. చిన్నతప్పుకైనా బానిసకి మరణశిక్ష, దాంట్లోనూ భయంకర

మైన చిత్రవధలాంటి దములుపర్చేవారు. ఇంక మనదేశంలో మొన్నటిదాకా స్త్రీలని బలవంతంగానైనా భర్తశవంతోపాటు సహగమనం చేయించేవారు. ఈ ఆచారానికి, బానిసజాతిని హింసించిన ఆ విధానానికి తేడా ఏమిటి ?

ఇప్పుడు ఆ సహగమనం రద్దయినా భర్తపోయిన స్త్రీని జీవశ్చవంలా సమాజం చూస్తుంది. ఆమె ఎదురువస్తే అప శకునం. మంచిబట్టలు, నగలు, పువ్వులు, కుంకుమ నిషిద్ధం. స్త్రీకి జుట్టుతీయించటం పూర్వంకన్నా కొంత తగ్గింది కాని పూర్తిగాపోలేదు. వైధవ్యంపేరట ఆమె అన్ని సుఖాలు చంపి వేసి హీనంగా చూడడం మరణంకన్నా ఎక్కువైంది కాదా! ఆడపిల్ల పుట్టిందంటేనే అందరికీభయం, చులకన. ఆమె గట్టిగా నవ్వకూడదు, మాట్లాడకూడదు. దగ్గరబంధువులైనా, ఎంత ప్రాణస్నేహితులైనా పురుషుడయితే ఆమె చనువుగా ఉండ రాదు. భర్త అపార్థాలు తీస్తాడు. సంఘం ఆమె ననుమా నంగా చూస్తుంది. ఈవేళకూడ ఈ అంతర్జాతీయ మహిళా దశాబ్దిలోకూడ ఎంతోమంది భర్తలు కోపంవస్తే భార్యల్ని వళ్లు తెలియకుండా కొడతారు. కార్మిక స్త్రీ ఐనాసరే, చదువు కున్న స్త్రీ ఐనాసరే, మధ్యతరగతి స్త్రీ ఐనా, ఆఖరికి డబ్బున్న స్త్రీ ఐనా ఈ అమానుషంనుంచి తప్పించుకోలేదు. చాలా చోట్ల భార్యంటే ఇష్టంలేకపోయినా (పురుషుడు) మరో స్త్రీని మరిగినా భార్యని చంపివేయడం జరుగుతోంది. కిరసనాయిలు పోసి అంటించిగానీ, విషంపెట్టిగానీ, పీకపిసికిగానీ, కత్తితో

పొడిచిగానీ దారుణంగా చంపేస్తున్నారు. రోజూ మనం పేప ర్లలో ఇలాంటి కేసులు చదువుతూనే ఉంటాం. పేపరు వారి దాకా రాని హత్యకేసులు ఇంకా చాలా ఉంటాయి. డబ్బు పలుకుబడి పురుషుడివెంపు ఉండటంనుంచి, స్త్రీవెంపు ఎవరూ గట్టిగా పోరాడేవారు లేకపోవటంవల్ల నేరాన్నుంచి పురుషులు తప్పించేసుకుంటున్నారు. ప్రభుత్వం, ప్రజలు ఈ విషయంలో బాగా శ్రద్ధతీసుకుని నేరస్తుల్ని తగినవిధంగా శిక్షిస్తే ఈనేరాలు తగ్గటానికి అవకాశం ఉంటుంది. (ఇరుగుపొరుగుకూడా వాడి భార్యని వాడుకొంటున్నాడు. తిట్టుకుంటున్నాడని మనకేం అని ఊరుకోక కల్పించుకొని అక్రమాన్ని ఎదుర్కోవాలి. అసలు చిన్నతనంనుంచే పురుషుడెక్కువా, స్త్రీ తక్కువా అన్న భావం నూరిపోస్తారు మనవాళ్ళు. తినేతిండి విషయంలోకూడ ఆడ వాళ్లు ఏంతిన్నా వెళిపోతుంది అనే తక్కువభావంతో ఉంటారు. పురుషుడు వివాహం చేసుకోకపోయినా, ఇష్టంవచ్చినట్టు తిరి గినా తప్పులేదు. స్త్రీ నిర్బంధంగా, నిర్నిబంధంగా వివాహం చేసుకోవలసిందే! వివాహానంతరం జీవితం ఎంత కష్టనిష్ఠూర మైనా కర్మఫలం అనుకుని, సంఘానికి జడిసి భరించవలసిందే! వివాహం స్త్రీ పురుషు లిద్దరికీ సమానావసరమైనా తనను వివాహంచేసుకున్నందుకుగాను స్త్రీయే వేలకువేలు కట్నం డబ్బు చెల్లించవలసివస్తోంది. ఇంక ఈ వివాహంతో పుట్టింట్లో ఉన్న కాస్తస్వేచ్ఛా చాలామంది స్త్రీలకి పోతుంది. భర్తల అధికారం, అజమాయిషీతోపాటు అత్తాడబిడ్డల ఆరళ్ళెక్కు

వవుతాయి. సారె, చీర బాగా తేలేదనో, పండగ కట్నాలు ఘనంగా ముట్టలేదనో సాధింపులు మొదలై భార్యాభర్తల మధ్య ఉన్న కాస్త సామరస్యాన్ని చెడగొడతాయి. దురదృష్టం ఏమిటంటే అత్తగా, ఆడబిడ్డగా, తోటికోడలుగా స్త్రీని స్త్రీయే హింసిస్తుంది. ఆమెదృష్టి చాలా సంకుచితమైపోయింది. ఇంటికివచ్చిన కోడల్ని ఉదారంగాచూసే మనస్తత్వం అలవర్చుకోవాలి స్త్రీలు. అత్తవారింట్లోని అనేక కష్టాలు, దుర్భర పరిస్థితులవల్ల ఎంతమంది స్త్రీలో ఆత్మహత్యలు చేసుకుంటున్నారు. కష్టాలు భరించలేక పుట్టింటికివస్తే తల్లిదండ్రులే గౌరవంగా చూడరు. సంఘం నీచంగా చూస్తుంది. అందర్నీ ఎదిరించి స్వతంత్రంగా బ్రతకడానికి చాలామంది స్త్రీలకి ఆర్థిక స్తోమతు ఉండదు. ఈ పరిస్థితుల్లో స్త్రీకి ఆత్మహత్యే శరణ్యం అవుతుంది. పురుషుల శ్రమశక్తికి విలువ ఉంది. ఉద్యోగం చేసో, కొంతకష్టంచేసో వారు డబ్బుసంపాదిస్తారు. (కాయకష్టం చేసే స్త్రీకి పురుషునిలా కూలిముట్టదు). ఉద్యోగాలుచేస్తే రిటైర్ అయాక పెన్షన్వస్తుంది. ఒకస్త్రీ సంసారంలో చేసే చాకరీ పురుషుడుచేసే శ్రమకన్న అధికమే! అయినా ఆ శ్రమకి విలువలేదు. రోజూ ఆమె తుడిచి శుభ్రంచేసే ఇంట్లోగానీ, భర్త ఆస్తిలోగానీ, తండ్రిఆస్తిలోగానీ ఆమెకి పురుషునిలా జన్మతః ఆస్తిహక్కు లేదు. ఈవేళకూడ చట్టాల్లో భర్త ఆస్తంతా ఎవరికిరాసినా భార్య అదేమని అడగడానికిలేదు. ఆమెకి మనోవర్తిమాత్రమే ఇస్తారు. ఇవాళ వచ్చిన ఆస్తి

హక్కు చట్టం స్త్రీకి నామమాత్రమైనదే. విల్లు రాయకుండా తండ్రిగాని, భర్తగాని మరణిస్తే భర్తవాటాలోగాని తండ్రి వాటాలోగాని అన్నదమ్ములతోపాటు పంచుకోవాలి. ఇది చాలా స్వల్పమైన ఆస్తిమాత్రమే. ఆ కాస్తకూడా కూతురికి భార్యకి లేకుండా చాలామంది వాళ్ళవాటా ఆస్తికూడా వీలు రాసేసుకునే వుంచుకొంటారు. ఈచట్టం మారాలి. "స్త్రీకి పురుషునిలా జన్మతః ఆస్తిహక్కు సంక్రమించాలి." ఆర్థికంగా స్త్రీ స్వతంత్రురాలైతే అణగి ఉండదని, సంఘం పాడైపోతుందని చాలామందికి భయం. అభివృద్ధికాముకులు సహితం స్త్రీలకి ఆస్తిలో సమానవాటా ఇవ్వటానికి ఇష్టపడరు. "ఆర్థికంగా స్వతంత్రం లేకపోవటం అన్నిరకాల బానిసత్వాలకి మూలం."

బానిసలు చరిత్రలో ఎన్నిసార్లు తిరగబడ్డా, శతాబ్దాల పాటు జయం పాలకులదే అవుతూవచ్చింది. ప్రతిసారి విప్లవ ప్రతీఘాతకులు విప్లవాన్ని ఇంకా తీవ్రంగా అణచివేయడమే జరిగింది. ఇది నిన్నటివరకు జరిగిన చరిత్ర. అలాగే ఏనాడో మొదలయిన స్త్రీ బానిసత్వం ఇంకా సమసిపోలేదు. పాలిస్తున్నది పురుషప్రపంచం అవటంవల్ల మతం, ధర్మం, న్యాయం, చట్టంఅన్నా నారినినిధి. చాలా పత్రికలు నిర్వహించే మహిళల శీర్షికలు, కబుర్లతోను, వంటా — వార్పుతోను నిండి వుంటాయి. సంఘంలో సనాతనులు, ఛాందసులేకాక అభివృద్ధి కాముకు లనబడేవారు సైతం ఆచరణలో అడుగు తగులుతూ

వున్నారు; స్త్రీకి పురుషునితో సమాన ప్రతిపత్తి లభించడానికి. ఆమె ఈ పరోక్ష బానిసత్వాన్ని ఛేదించి నిర్మూలించి వేస్తుందని హక్కులివ్వటానికి భయం. మనకి వరకట్న నిషేధచట్టం, భార్యవుండగా పురుషునికి మరో వివాహాన్ని నిషిద్ధంచేసేచట్టం ఇలాంటివి ఎన్నోవున్నా నేడు అవి ఎంత వరకు సఫలీకృతమవుతున్నాయి ? విఫలం అవడానికి కారణాలేమిటి ? చెదురు మదురుగా షెడ్యూల్డ్ కులాలతోబాటు స్త్రీలకుకూడ మంత్రి వర్గాలలోనూ, శాసనసభల్లోనూ ఒకటీ, అర స్థానాలిచ్చినా అక్కడ వారికున్న బలం ఎంత ? వారిలో ప్రత్యేకించి స్త్రీల సమస్యలగూర్చిన అధ్యయనపూర్వకమైన అవగాహనగాని, స్వతంత్ర ఆలోచనగాని, ఆచరణయోగ్యమైన స్వతంత్ర ప్రతిపాదనలుగాని వున్నవారుఎంతమంది? మేధావులు కార్యకర్తలు అయినవాళ్లు ఎక్కువగా మంత్రివర్గంలో వాల్గొనాలి. క్రాసన్ (స్పార్టకస్ నవల) బానిస యువతి 'వర్జీనియా'తో అంటాడు. "నేనింతబాగా చూస్తున్నాను నిన్ను. రాజభోగాలమరుస్తున్నాను. ఆ 'స్పార్టకస్' నే తలుస్తావు. అతనిలో గొప్ప ఏమిటి ?" అప్పుడు ఆవిడంటుంది, "ఎలా చెప్పను? మంచి నెలా నిర్వచించను? మా బానిసలలో ఆడా మగా తేడా లేదు. ఇద్దరూ ఒకలాగే పనిచేస్తాం. ఒకలాగే పోరాడతాం. ఒక్కలాగే ప్రేమించుకుంటాం. మాకు ఒకరికొకరు చెప్పరాని రహస్యాలు వుండవు!"

దీన్నిబట్టి స్వాతంత్ర్యం లేకుండా చేసి, స్త్రీకి ఎన్ని ఆభర-ణాలు, అలంకారాలు తొడిగినా మెదడు, హృదయం [illegible] కలిగే సహజస్పందనను, ఘర్షణను అణచి [illegible]స్తుంది. స్త్రీ పురుషుల ప్రేమవల్ల, [illegible] స్వాములుగా పరస్పరం ఆధిపత్యం వహించవచ్చు. [illegible] సమాజంలో పురుషుడు అధికారంతో స్త్రీ [illegible] అనురాగమనుంచికాదు. భగవంతుడు, [illegible] స్త్రీని అణచిపెట్టివుంచే ఈ 'అద్భుతమైన మాయ' [illegible] కాలం కొనసాగుతుంది?

శ్రీశ్రీ ఘోషించినట్లు "అనేకులింకా, అభాగ్యులింకా దీర్ఘశ్రుతిలో, తీవ్రధ్వనితో, విప్లవశంఖం పూరిస్తారో [illegible] యదార్థం. హెచ్చుతగ్గులు లేని ఓ సామాజిక వ్యవస్థ [illegible] నవతరించాలి. "జీవించడంకోసం జీవించాలి. [illegible] కోరుకోనడంవల్ల సమస్యలు పరిష్కారంకావు!" అంటాడు స్పార్టకస్. భర్తగా, ప్రియుసిగా, కన్నబిడ్డగా— పురుషుడి [illegible] చరిత్రపొడవునా నిరంతరం వంచింపబడి [illegible] మహిళలు పై వాక్యం జ్ఞాపకం పెట్టుకొని నవ[illegible] సమాజం నిర్మించేందుకు, నవశకం [illegible] కావాలి. "మనం పారిపోవద్దు, ఎక్కడికి పోయినా కొండల్లో, గుహల్లో మనల్ని బలవంతులు తరుముతూనే వుంటారు. ఇక్కడే నిలబడి, పోరాడి, గెల్చి తరతమభేదాలు లేని నవ

సమాజ నిర్మాణానికి కృషిచేద్దాం" అంటాడు స్పార్టకస్ బానిసల నుద్దేశించి. అదే నేటి మన మహిళలకికూడ వర్తించే సత్యం.

కనుకనే నేడు మనం — స్త్రీలం — మనపై జరుగుతోన్న అన్యాయాలు, అత్యాచారాలను దిగమ్రింగి నిస్పృహపడీ, నూతులు, గోతులు వెదకీ ఆత్మహత్యలు చేసుకొని లాభంలేదు. మనం నిలబడదాం, పోరాడదాం. నిలబడి, సహనంతో మనం సాగించే సంఘర్షణ, ప్రతిఘటవ — అదీ కడకు మనకు చిరస్థాయియైన విజయాన్ని సాధించిపెడుతుంది. సుషుప్తిలోను, జాగృతిలోనూకూడా మనం ఈ సంగతి విస్మరిస్తే, నిర్లక్ష్యపరిస్తే మన సంతతి, చరిత్రాకూడ మనలను క్షమించవు !

(హావార్డ్ ఫాస్టురచన "స్పార్టకస్" యిచ్చిన ప్రేరణతో).



# "న మమ" "నాతి చరామి"

మనలో చాలామందికి స్త్రీకి పెళ్ళయితే ఆమె పూర్తిగా భర్తహక్కయి వుంటున్నది. తల్లిదండ్రులకి ఆమెమీద ఇంకే అధికారములు లేవు అన్న భావముంది. దీనికి తగ్గట్టుగానే భర్తల ప్రవర్తన వుంది నేడు.

కనీసం పుట్టింటివారికి ఏదైనా ఆపద వచ్చినా చూడ టానికి భర్త పంపుతేగాని ఆమెకువచ్చే అధికారంలేదు. చూపులకే ఆమె ఇంత పరాధీనతగా ఉన్నప్పుడు ఇంక ఆర్థి కంగా ఆమె పుట్టినింటివారిని ఆదుకొనడంలో ఎంత అశక్త రాలో చెప్పనవసరంలేదు. పుట్టింటివారినుంచి సహాయం పొంద డానికేగాని, వారిని ఆదుకోడానికి ఈ ఇరవయ్యో శతాబ్దిలో కూడా ఆమెకు స్వాతంత్ర్యం లేదు.

కాని నిజం ఆలోచిస్తే మన భారతీయ వివాహమంత్రా లలో స్త్రీకి వివాహం పేరిట పుట్టింటితో సంబంధాలు తెగి పోవడంలేదు. ఆమె పూర్తిగా పరాయివారి సొత్తయి పోవటం లేదు. మన వివాహాల్లో ఆ మూడుముళ్లు పడగానే తలి దండ్రులు ఇక్కడనుంచి మన అమ్మాయి పరాయిపిల్ల అయి పోయింది. మనకేం హక్కులేదు మన అమ్మాయిమీద అను కుంటూ కంటనీరెట్టుకొంటారు. ఇది సరికాదు.

అంటుంది. ఇరువురు కలసి స్నేహంగా నడవవలసిన వారుగాని దంపతులు భర్త అడుగుజాడల్లోనే భార్య యాంత్రికంగా ఆత్మను చంపుకొని నడవాలన్నది కాదు. హిందూ వివాహ ఉద్దేశం, ఇంకా తన ఇంటికి వరుడు వధువుని తీసికెళ్ళేటప్పుడు చదివే మంత్రాల అర్థం ఇది. "ఓ వధువా! నీవు నా గృహానికి రాణివి. నన్ను ప్రేమతో పాలించి, నా గృహమును సర్వ సౌఖ్యములతో నింపుటకు, నాతోరమ్మ్మ అంటాడు. ఇక్కడ ప్రేమతో భార్యాభర్త లిరువురు ఒకర్ని ఒకరు పాలించు కోవాలిగాని, అధికారంతో, అహంకారంతో కాదని మనకి స్పష్టం అవుతోంది.

అలాగే వధువుని అత్తగారింటికి అంపకం పెట్టేటప్పుడు అత్తా ఆడబడుచులు, తోటికోడళ్ళు, వారి భర్తలకి వధువు తలిదండ్రులు ఆమె చేతిని మనకి, అతి పవిత్రమైన పాలలో ముంచి, వారి చేతిలో పెట్టి అప్పగిస్తారు అన్నిటితో. పిల్లని బాగా చూసుకోమని అప్పగిస్తారు.

కాని ఎంతోమంది అత్తలు, ఆడబిడ్డలు, తోటికోమళ్ళు, భర్తలు తమని నమ్మి తమ కప్పగించిన ఆ వధువుని మాట లతో చేతలతో హింసించి, కొందరసలు సరిగా తిండి పెట్టక ఆమె చేత మోయలేని చాకిరి చేయించి, ఏమైనా అంటే పుట్టిం టికిపంపి ఇలా పలువిధాల ఆమెను హింసిస్తున్నారు. దైవం ఎదురుగా పెద్దల ఎదురుగా పంచభూతముల సాక్షిగా అప్ప గించిన ఆ అమ్మాయిని ఎన్నో బాధలకు గురిచేస్తున్నారు.

ఆనాడు చేసిన ప్రతిజ్ఞలు మరిచి ఇలా ఆడినమాట తప్పి ఓ అమాయకురాల్ని ఉసురుపెట్టే వారినీ ఏ విధంగా సంఘం, ప్రభుత్వం శిక్షించాలి? "స్త్రీలకుకూడా కార్యేషు దాసీ, కరణేషు మంత్రి" అని మన పెద్దలు ఓ మంచి శ్లోకాన్ని చెప్పారు. ఇంకా ఎన్నో మంచి బుద్ధులు చెప్తారు పిల్లని పంపేటప్పుడు.

శోభన మంత్రాలలో కూడా స్త్రీ, పురుషులు ఏ విధంగా దాంపత్యజీవితంలో నడుచుకోవాలో చక్కగా విశదపరిచారు మన పెద్దలు. అంతేకాదు దాంపత్యజీవితంలో స్త్రీకి ఎక్కువ స్వాతంత్ర్యం ఇచ్చారు మన పెద్దలు. మతాన్ని, దైవాన్ని, హిందూవివాహకలాపాన్ని ఇష్టపడని అనేకమంది ఆధునికులు కూడా, మన వివాహమంత్రాలలో స్త్రీకి యిచ్చిన గౌరవ స్థానాన్ని శ్లాఘించకుండా వుండలేకపోతున్నారు. అంతేకాదు వివాహానికి ముందు పఠించే "మహాసంకల్పం" లోని అంద చందాలని, భావగంభీరతని మెచ్చుకొంటున్నారు. మనకి చాలా పూర్వులయిన మన పెద్దలు ఆచార వ్యవహారములను, ఆనాటి మానవసంఘం గురించి తెలుసుకోవాలంటే మన వివాహంలో జరిపే తంతులు, ఆయా సందర్భాల్లో ఉచ్చరించే ఆ మంత్రాలు మనకి ఎంతో సహాయపడతాయి. ఆనాటి వారి జీవితవిధానం మరచిపోకుండా, ఈనాడు ఆయా కర్మకలాపాలద్వారా వివాహాల్లో మనం జ్ఞప్తికి తెచ్చుకొంటున్నాము.

ఇలా ధర్మార్థ కామాల్లో సహచారిణిగా పురుషుడికి వుండాల్సిన భార్య లేనాడు చాలాచోట్ల చాల నికృష్టంగా బానిసత్వంతో జీవిస్తున్నారు.

వివాహానికి కట్నం ప్రధానంగావుంది నేడు. కట్నాన్ని చూసి పిల్ల నంగీకరించడం అవుతోంది. ఇలా డబ్బుతో కొలవబడే వివాహాల్లో నిజమైన ప్రేమ ఎలా పుట్టుకొస్తుంది?

స్త్రీకి సహధర్మచారిణి, అర్థాంగి అన్న బిరుదు ఎలాగ సార్థకం అవుతుంది? వివాహానికి ధర్మం, ప్రేమ, మొదలయిన మంచిగుణాలు ప్రాతిపదికగా వున్నప్పుడే ఆ వివాహం ఏ పద్ధతిలో జరిపించుకొన్నా విజయవంతం అవుతుంది. నోటితో కేవలం ధర్మాలు వల్లిస్తూ చేతలలో వైవాహిక జీవితాన్ని నరకం చేసుకొనేవారు "వివాహ" శబ్దానే అపవిత్రం చేస్తున్నారు.



# శ్రీ రాజయోగం

మహాపురుషుల ప్రవచనాలు, గ్రంథాలు యెన్నిసార్లు చదివినా, నిత్యనూతనంగా కనిపిస్తాయి. దానికి కారణం, వారు ప్రత్యక్షంగా అనుభూతిపొందిన సత్యాలు నిర్వచించడమే. "నానృషిః కురుతే కావ్యమ్" అన్నట్లు వాళ్లు మనకి కనిపించే జ్ఞానంవల్లేకాక, అతీంద్రియ జ్ఞానంవల్లకూడా మనకి అనేక సంగతులు గ్రంథస్తం చేసిపెట్టి, మళ్ళీ మనం వెతుక్కో అక్కర లేకుండా మనదారి సుగమం చేసిపెట్టారు. ఇలాంటి పుస్తకాలలో, శ్రీ వివేకానందుని రాజయోగం ఒకటి, స్వామి అమెరికాఖండవాసుల కిచ్చిన ఉపన్యాసముల సారాంశమే యీ గ్రంథరాజము. శ్రీ వివేకానందులు ఎంతభక్తులో - అంత హేతువాది. ఆత్మవిశ్వాసం కలవాడు. ఈయన గ్రంథం అన్ని మతములవారికి, అందరి ప్రజలకు వచ్చుతుంది. ఇప్పుడు ఈ గ్రంథములోని కొన్నిసంగతులు తీసుకొందాము.

భగవంతునికి అనేక నామములున్నను, "తస్యవాచకః ప్రణవః" అన్నారు. ఎందుచేతననగా ఇది శబ్దములన్నిటికి మూలమగు స్వాభావిక సంజ్ఞయై యున్నది. మనము ఈ శబ్దము నుచ్చరించునప్పుడు శబ్దోచ్చారణ ప్రక్రియనంతా చూపును. అన్ని శబ్దాల మూలం ఓంకారము కనుక ఓంకారము జపించుట, అర్థమును భావించుట ముక్తిహేతువు.

మనస్సు బహుచంచలమైనది. ఏదో విషయం ఆలంబన ముగా లేనిదే మనస్సు నిలువలేదు. అందుకు ధ్యానము ఎంతయు ఆవశ్యకమై యున్నది. మన సంస్కారములను ఎంత అణచిపెట్టుదమన్నను ఇవి చిత్తములో సూక్ష్మావస్థలో వుంటాయి. కనుక "మన ఏవ బంధమోక్షః" అన్నట్లు వశీకృతమైన మనస్సే మనకి మిత్రుడు.

రోగము, సంశయము, అజాగ్రత్త, భ్రమ, చిత్తస్థైర్యము నిలువకుండుట అనునవి సాధకుని ప్రబల శత్రువులు. నియమంగా కొంతకాలమైనా ప్రతివారు ధ్యానము అలవాటు చేసుకోవాలి. గీతలోకూడా భగవానుడు "మనస్సు ఎంత చంచలమైనా, అభ్యాస వైరాగ్యమువలన వశీకృతం చేసుకో వచ్చును" అన్నాడు. మరియు నిత్యానిత్య వస్తువివేకము, కరుణ, సంతోషము, స్నేహము ఈ మొదలైన గుణములు అలవరచుకొన్నచో చిత్తప్రసన్నత బడయువచ్చును. ఈ విధమైన మనోనిగ్రహమువలన మనకు మంచి శక్తి లభిస్తుంది.

ఇంకను మనం ద్వేషం, కోపం మొదలగు గుణములు నిగ్రహించినప్పుడెల్ల, అపారమైనశక్తిని చేకూర్చుకొంటు న్నాము. ఎప్పుడూ అసూయ, క్రోధము, ఒకరికి చెఱుపు చేయుట, ఇవి అలవాటుచేసుకున్న మననుంచి వెలువడిన ఈ దుష్టశక్తులు కాలక్రమేణ కొన్నిరెట్లు అధికంగా పెరిగి మనకు హాని చేయకమానవు. అప్పుడు హరిబ్రహ్మాదులైనా, ఆ దుష్కర్మను నాశనం చేయలేరు - అని స్వామిజీ చెప్పారు.

ఎప్పుడైనా, నీవు చింతచేత, క్రోధంచేత ఆవరింపబడి ధుమ ధుమలాడుతున్న మొహంతో వున్నా, ఆ భావాలు విడనాడినదాకా, నీవు నలుగురిలోకి రావద్దు. అంత లాగున, నీలోంచి వెలువడే ఆ కిరణాలు వాతావరణాన్ని షితం చేస్తాయి. దేవాలయాలు పవిత్రంగా వుండాలంటే, అక్కడికి వెళ్ళే సాధకులు యెంత పవిత్రతతో వుంటే, అవి అంత మనలను పవిత్రం చేయగలవు కనుక ఇంటిలో అయినా, నీవు ధ్యానానికి ఒకగది కేటాయించుకుని బాహ్యాభ్యంతరాలుశుచిగా నిర్మల మనస్సుతో, ఆ గదిలో ప్రవేశించి ధ్యానంచెయ్యి అంటారు స్వామిజీ. ఇంకా ప్రాణం అనగా వట్టి శ్వాసకాదు? దీని కాధారమైనశక్తి, ఈ జగత్తునందలి శక్తే ప్రాణశక్తి, ఈ శక్తి కల్పారంభమున చలనరహితముగా వున్నట్టు కన్పడి, సృష్టికాలమున వ్యక్తమగును. ఇదే జంతువులలో, మనుష్యు ంలో నాడీచలనరూపంగా కనిపిస్తోంది. ఈవిశ్వం అంతా ప్రాణం, ఆకాశంయొక్క కలయిక. మన శరీరం అంతే. శ్రీ పతంజలి మహర్షి "కొలదిగా రేచక, పూరక, కుంభకము లభ్యసించిన చాలు. దానివలన మనఃప్రసన్నత వస్తుంది" అన్నారు.

చిత్తము తన చుట్టూవున్న, ప్రాణశక్తిని లోపలికి లాగుకొనుచు, అందులోంచి, భౌతిక శక్తులనేగాక, ఇచ్ఛా జ్ఞానాది మానసిక శక్తులనుగూడ ఉత్పత్తిచేయునట్టి యంత్ర మని చెప్పవచ్చు. కనుక శ్వాసనియమము అభ్యసించినచో శరీరమందలి వివిధ చలనములు, నాడీవాహినులను వశపర్చు

కొనవచ్చు. వెన్నెముక కుడి వైపు పింగళానాడి, ఎడమ వైపు ఇడానాడి, మధ్యభాగమున సుషుమ్నానాడి యను బోలుగా నుండు కాలువయు ప్రతీ మానవునియందు కలవు. యోగు లలో మాత్రము సుషుమ్నానాడి పనిచేయును. సమస్త దుఃఖాతీతమైన దివ్యజ్యోతిని ధ్యానించుటవలన మనఃప్రసన్నత కల్గును. ఇంకొకలాకూడ ధారణచేయవచ్చు. మన హృదయ కమలము, అధోముఖముగా పద్మంలా వున్నదనియు, అందుండి సుషుమ్నాశక్తి మన ఉఛ్వాస నిశ్వాసాలలో, పైకి వెగయు చున్నదనియు, దానియందు దివ్యజ్యోతివుందని భావించవలెను.

కనుక మన చెడుఅలవాట్లుని నిగ్రహించి, యమ, నియ మాలు అవలంబించి, ధ్యానభక్తి యోగాలవల్ల ముక్తిపొంది మానవజన్మ సార్థకతచేసుకుందుముగాక! "తస్యాపి నిరోధే సర్వ నిరోధా న్నిర్బీజః సమాధిః" ఇట్లు సర్వవృత్తి నిరోధము సిద్ధిం చినయెడల తన సహజస్థితిని అందరూ పొందుదురు.



# 1857 స్వరాజ్య సంగ్రామం

ప్రపంచ సాహిత్యరంగంలోనే మహావిప్లవగ్రంథం వీర సావర్కార్ రాసిన "పద్దెనిమిదివందల యాభైఏడు స్వరాజ్య సంగ్రామ చరిత్ర." పంతొమ్మిదివందల ఎనిమిదిలో మరాఠీ భాషలో శ్రీ సావర్కార్ ఈ గ్రంథాన్ని రాశారు. భారత జనతలో దేశభక్తి, వీరత్వాన్ని మేల్కొల్పడానికి, సావర్కార్. "గతాన్ని గురించి స్మృతిలేనిజాతికి భవిష్యత్ లేదు. అయితే గతాన్ని గురించి గొప్పలు చెప్పుకుంటూ కూచోడంకాక భవిష్యత్తుని నిర్మించేందుకు గతచరిత్ర ఎలా సహాయపడు తుందో ఆలోచించుకోవా" లంటారు. సావర్కార్ రచించిన ఈ అద్భుతమైన గ్రంథరాజం ఇంటింటా పిన్నా పెద్దా చదివి మననం చేయాల్సినటువంటిది. ప్రథమ భారత స్వతంత్ర సంగ్రామంగురించి ఈగ్రంథంలోవున్నవి. వివరాలు మరెక్కడా కానరావు. ఆ గ్రంథంలోని కొన్ని ఘట్టాలను, ఆయా వీరుల చరిత్రలను కొంతైనా మనం సమీక్షించుకొందాం.

ఏవో కొన్ని దుష్టశక్తుల విద్రోహచర్యలవల్ల ఆనాటి స్వాతంత్ర్యసమరం విఫలం అవవచ్చు. అంత మాత్రాన ఆ సంగ్రామంలో పాల్గొన్నవీరుల శారీరక, మానసికశక్తి, రాజ నీతిజ్ఞత, సమయస్ఫూర్తి కొరవడ్డాయనడానికి కేమాత్రం వీలు లేదు. ఆనాటి వీరుల్లో ప్రముఖుడైన "అజీముల్లాఖాన్" ని

గూర్చి సావర్కార్ ఇలా అంటారు: "ఆయన పద్దెనిమిదివందల ఏభై ఏడు విప్లవయుద్ధానికి సంబంధించి, విస్మరించదగనివ్యక్తి." ప్రథమ స్వాతంత్ర్య సమరానికి రూపకల్పనచేసిన కొద్దిమంది మేధావులలో ఈయన ముఖ్యుడు. విప్లవం తొక్కిన వివిధ దశలలో రూపొందిన, వివిధ పథకాలలో అజీముల్లాఖాన్ రూపొందించిన పథకాలు ప్రత్యేకంగా గమనింపదగినట్టిని అజీముల్లాఖాన్, నానాసాహేబ్‌కి అతి విశ్వాసనీయుడైన సలహాదారు, బహుభాషావేత్త. అతడు పద్దెనిమిదివందల ఏభై నాలుగులో నానాసాహేబ్ యొక్క ముఖ్యప్రతినిధిగా లండన్ వెళ్ళాడు. తన భాషాచతురత, మర్యాద, మన్ననలవల్ల అచిర కాలంలోనే ఆంగ్లేయుల మన్ననలందుకొన్నాడు. ఆంగ్లేయుల అభిమానం చూరగొన్నాడు. కాని అతను వెళ్ళినపని నెరవేర లేదు. "నానాసాహేబ్ దత్తపుత్రుడు కనక అతని తండ్రి బాజీరావ్ కిచ్చే నష్టపరిహారం నానాసాహేబ్ కివ్వబడదని" ఆంగ్లేయులు ఖండితంగా వక్కాణించారు! తను వచ్చిన పని ఇలా విఫలమయినా 'అజీముల్లాఖాన్' వెంటనే ఇండియాకు తిరుగుప్రయాణం కట్టలేదు. అతను యూరప్ అంతా పర్యటించి బ్రిటిష్‌వారి ఆనుపానులు తెలుసుకోవాలనుకొన్నాడు. దానితో అతను టర్కీ వెళ్ళాడు. అక్కడ సుల్తాన్‌ని కలుసుకొన్నాడు. అప్పుడు జరుగుతున్న టర్కీ రష్యా సమరంలో ఇంగ్లీషు వారు 'సెబస్టపోల్' యుద్ధంలో ఓడిపోయారని విని రష్యాకూడా వెళ్ళాడు. రష్యాలో ఉండగా 'లండన్ టైమ్స్' విలేఖరి

'రస్సెల్' తో మైత్రి నెరిపాడు. "మిమ్మల్నికూడా ఓడించే అంత ప్రజ్ఞావంతులైనా రష్యన్ రుస్తుములని చూడాలని నాకు కోరికగా ఉందని అడిగాడు. అతని కోరిక నంగీకరించి తన గుడారంలోకి రానిచ్చాడు రస్సెల్. ఆ రోజంతా రష్యనులు యుద్ధసామర్థ్యాన్ని వారి తుపాకులనుండి వెలువడుతున్న అగ్ని వర్షాన్ని వారి ధైర్యస్థయిర్యాల్ని కన్నార్పకుండా చూశాడు, అజీముల్లాఖాన్. ఆ సమయంలో అజీముల్లాఖాన్ యిలా అనుకొని ఉంటాడు. "భారతీయులుకూడా ఆంగ్లేయులను ఓడించాలంటే యిప్పుడు రష్యనులు చూపినలాంటి యుద్ధ విశారదతని అలవరచుకోవాలి." అని అందుకే ఆయన ఆ సంగ్రామంస్వయంగా వీక్షించి ఆ లోతుపాతులని తెల్సుకొన్నాడు. ఆ తరువాత "ఈజిప్టు" కూడా వెళ్లి అక్కడ కూడా దౌత్యపథకాలని రూపొందించడానికి పూనుకొన్నాడు. రాజనీతి విశారదుడైన అజీముల్లాఖాన్. ఆనాడు (ఇప్పటిలాకాక) హిందూ ముస్లింలు హిందూదేశాన్ని తమ మాతృదేశంగా పరిగణించారు. మన మత సాంప్రదాయాలలో భేదం ఉండవచ్చుకాని మన యిరువురం సోదరులమని ఆనాటి భారతీయులు ముస్లిలు గాఢంగా భావించారు.

ఇంక ఆనాటి విప్లవవీరులలో ప్రముఖుడైన నానా సాహేబ్ రాజనీతిజ్ఞతచూస్తే చాలా అక్కజం కలుగుతుంది. పద్దెనిమిదివందల యాభైఆరుకి ముందే నానాసాహేబ్ ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామానికి భారతప్రజలని ఆయత్తంచేయడానికి

పూనుకున్నాడు. దేశం నలుమూలలకి ప్రతిభావంతులు విశ్వసనీయులైన ప్రచారకులని ప్రజలను సముత్సుఖులను గావించడానికి పంపాడు రహస్యంగా. ఒక్క ప్రజలనే చైతన్యవంతులను చేయుడానికి కాక రాజులను మహారాజులను కూడా సంగ్రామానికి పురికొల్పాడు. "బానిసత్వపు ఉక్కుపాదాలక్రింద దేశం, దేశభద్రతా ఎలా నలిగిపోతున్నాయో ప్రతీ సంస్థానాన్ని బ్రిటిషువారు ఏదో మకపెట్టి, తమ రాజ్యంలో ఎలా విలీనం చేసుకొంటున్నారో ఇవన్నీ సామ్రాజ్యాధీశులకు వివరంగా లేఖలురాసి, మనందరకి స్వాతంత్ర్యం కాపాడుకోవడంకోసం ఈ మహాసమరంలో మీరందరూ పాల్గొనాలని వారినికోరాడు.

అప్పుడు ఆంగ్లేయులు పర్షియాతో యుద్ధంలో ఉండడం వల్ల ఈ సమరంలో భారతదేశం వారిని ఎదిరిస్తే ఉభయ దేశాలకి లాభం అని పర్షియాకిచెందిన 'షా' ఢిల్లీ సామ్రాట్ "బహదూర్ షాకు" లేఖ రాశాడు. ఇలా షా, ఢిల్లీపాదుషా, బహదూర్ షా, బ్రిటిషువారిని అదనుచూసి పడగొట్టాలని యత్నిస్తూంటే ఢిల్లీ ప్రజలుకూడా స్వాతంత్ర్య సమరంలో ఉరకడానికి పరవళ్లు తొక్కుతున్నారు. విప్లవకారులు పద్దెనిమిదివందల ఏభై ఏడవ సంవత్సరంలో ఢిల్లీ గోడలనిండా కరపత్రాలను అంటించారు. పర్షియాసైన్యాలు, 'ఫిరంగీలనుండి' (ఆంగ్లేయులనుండి) భారతదేశాన్ని విముక్తిచేయనున్నాయి. కనుక భారతీయులందరు, ధనికులు, పేదలు, పిన్నలు, పెద్దలు, విద్యావంతులు, పామరులు అను భేదం లేకుండా అందరూ

కలసి బ్రిటిషువారిని యుద్ధరంగంలో ఎదిరించాలని''. అయితే చిత్రం ఏమిటంటే ఇలాటి కరపత్రాలు రోజురోజూ గోడల నిండా అంటింపబడుతున్నా ఆంగ్లేయులు ఎన్ని విధాల ప్రయత్నించి ఆ కరపత్రా లెవరు అంటిస్తున్నారో తెలిసికోలేక పోయారు. లక్నో నవాబు, ఆయన వజీరుకూడా, నానా సాహేబ్ లాగే విప్లవ ప్రయత్నాలు చురుకుగా సాగించారు. ఆంగ్లేయులకి తమ ప్రయత్నం కానరాకుండా పైకి 'లక్నో వజీరు' భోగవిలాసాలలో తేలిపోతున్నట్లు కనిపించేవాడు. బెంగాల్ సైనికులకు రహస్యంగా విప్లవంగూర్చి సమాచారాలు అందచేసేవాడు. అంతేకాదు లక్నోవజీరు 'అలీనక్కా ఖాన్' ఫకీర్ల వేషంలో విశ్వసనీయులైన ప్రతినిధులను, సైనికులను జాగ్రత పరచేందుకు పంపేవారు. స్వారాజ్యంయొక్క ప్రయోజనాన్ని విశదీకరిస్తూ సైన్యంలోని భారతీయాధికారులతో ఉత్తరప్రత్యుత్తరాలు నడిపేరాయన. భారతస్వాతంత్ర్య సమరంలో పాల్గొనే సైనికులను ముస్లిములైన 'ఖురాన్' సాక్షిగా, హిందువులైన 'గంగాజలం, తులసీదళాల' సాక్షిగా ఇలా ప్రతినచేయించేవారు: "బ్రిటిషుపాలనను నాశనం చేసేందుకు ప్రాణా లొడ్డుతామని." ఇలా సైనికులు, సుబేదార్లు, జమేదార్లు ఇతర్రతా ఉన్నతాధికారులు ప్రతిన తీసికోగానే ఆ దళం అంతా భారత స్వాతంత్ర్య విప్లవానికి సన్నద్ధంగా ఉండేది. ఇలా ఆ వజీర్, బెంగాల్‌లోని, సైన్యానంతనీ తన వశం చేసుకొన్నాడు.

విప్లవ ప్రయత్నాలు దేశం నలుమూలలా ఎంతో రహస్యంగా జరుగుతున్నాయి. ఆంగ్లేయాధికార్లలోని అతి తెలివైన, జిత్తులమారివాళ్ళుకూడా విప్లవకారుల ప్రయత్నాలని ఏమాత్రం కనిపెట్టలేకపోయారు. దేశం నలుమూలలా విప్లవాన్ని వ్యాపింపచేయడానికి సన్యాసులు, సాధువులు, ఫకీర్లు పండితులు నియోగింపబడ్డారు. బ్రిటిషువారి కేవిధమైన అనుమానం కలుగకుండా, 'బారక్‌పూర్' మొదలు మీరట్ వరకు అంబాలా, పెషావర్‌లలో, ముఖ్యంగా ప్రతి 'కంటోన్మెంట్' వద్ద సంప్రదింపులు నడిపేవారు ఫకీర్లు సన్యాసులు. అప్పుడప్పుడీ మతాధిర్లనిచూచి ఆంగ్లేయుల కనుమానం వచ్చినా, అసలే ఆవుకొవ్వు, పందికొవ్వు, తూటాలలో ఉపయోగించమన్నామని, హిందూ ముస్లిములకి కోపంగా ఉందని ఈ సమయంలో వాళ్ళ మతాధికార్లనేమైనా అంటే, 'మా మతంమీద దాడిజరుపుతున్నారని' ప్రజలు ఎదురు తిరుగుతారని భయపడ్డారు.

మహిళాలోకంలో, పాటక ప్రజలలోకూడా విప్లవ బీజాలు నాటి, సాతంత్ర్య సమరానికికూడా ఉద్యుక్తులనుచేయాలని ఆ విప్లవకారులు తీసుకొన్న జాగ్రత్తలనుచూస్తే యావద్భారత దేశం ప్రథమ స్వాతంత్ర్య సమరానికి ఎలా తన సహాయ సహకారాన్నిచ్చిందో మనకి తెలుస్తుంది. ప్రజలు కలసికట్టుగా పాల్గొనే ఉత్సవాలలో జాతర్లలో విప్లవకారులు కలసిపోయేవారు, అక్కడికక్కడ క్రొత్త నృత్యాలు క్రొత్త

పాటలు ఆడేబొమ్మలద్వారా, విప్లవాన్ని విశదీకరించేవారు. ఎరుకలసానులు, వైద్యులవేషాలలో స్త్రీలకి విప్లవసందేశాలు అందచేశారు. ఎరుకలసానులు 'అంబ' చే బ్రిటిషువారి దుశ్చర్యలని పలికించేవారు. మాతృదేశానికి పట్టిన బ్రిటిషు పరిపాలనా భూతాన్ని వదలించడానికి విప్లవోద్యమ 'ఆంక్షలు' కట్టుకోవాలనేవారు. గత జాతీయవైభవంగూర్చి ప్రస్తుత దుర్దశను గూర్చి గీతాలాపాలు చేసేవారు. మరోప్రక్క శౌర్యధైర్యాలతో ఉజ్వలభవిష్యత్తులోకి ప్రజలు పురోగమించేందుకు జ్యోతిష్కాలు వినపడేవి. 'ఫిరంగీరాజ్యం ఏర్పడిన వంద సంవత్సరాల్లో అది నశింపు అవుతుందని 'ఓ మహాయోగి' జ్యోతిష్యం చెప్పాడనే వదంతిని కన్యాకుమారినుంచి హిమాలయాలదాకా వ్యాపింపచేశారు. వివిధప్రాంతాలలో పనిచేస్తున్న ఈ విప్లవకారులకి ఉత్తరప్రత్యుత్తరాలు బ్రిటిషువారి కర్థమవని విధంగా గీతలతో చుక్కలతో అంకెలతో పంపేవారు. పద్దెనిమిదివందల ఏభైఏడు మే పదమూడవ తేదీన సిపాయిలంతా బ్రిటిషువారిని ఎదిరించి నిర్మూలించాలని విప్లవకారులంతా నిర్ణయించారు. ఆ రోజు ఆదివారం కనక ఆంగ్లేయాధికారులు చాలామంది చర్చిలో ఉంటారు. కనుక సులువుగా వారిని మట్టుపెట్టవచ్చునని వుద్దేశించారు. ప్రభుత్వకోశాలను కొల్లగొట్టడం, జైళ్ళలోని ఖైదీలను విడిపించడం మందుగుండు ఆయుధాలన్ని స్వాధీనం చేసుకోవడం. ఇది విప్లవకారుల ఆలోచన. సైన్యం అంతా దానికోసం సమీకరించ

బడింది. చపాతీలద్వారాకూడా విప్లవవ సందేశం నలుమూలలకీ కొనిపోబడేది. ఈ చపాతీలను ప్రభుత్వాధికారు లనేక సార్లు పిండిపిండిచేసి అందులో ఏదైనా సంకేతం ఉందేమోని చూసేవారు. అందులో ఏమీరాసి ఉండేదికాదు. వారికెన్ని విధాలుగా చూసినా అందులో ఏ రహస్యం కనపడేదికాదు. విప్లవకారులు మటకవి మహత్తర సందేశాలనందిచ్చేవి. అద్భుతమైన ఈ మహోపాయాలను చూస్తుంటే భారతరాజనీతిజ్ఞుల అపార మేధాశక్తి కాశ్చర్యం కలుగుతుంది. ఇది యిలా ఉండగా బ్రిటిషువారికి కొస్తోకూస్తో విప్లవకారులమీద అనుమానం కలిగినట్లుంది. బారక్‌పూర్‌లోని, పందొమ్మిదవ దళాన్ని నిరాయుధులుగా చేయాలని ఉత్తర్వులు జారీచేశారు. అయితే ఆ దళంలోని "మంగళపాండ్యా" అన్న దేశభక్తుడీ అవమానాన్ని సహించలేక అవేశంపట్టలేక అనుకొన్న తేదీకి ముందుగానే 'హడ్సన్' దొరని తుపాకితో పేల్చాడు. బ్రిటిషువారు పాండ్యాని బంధించమని సైనికులకి ఆజ్ఞయిచ్చారు. కాని ఒక్కసైనికుడు వారి ఆజ్ఞను పాలింపలేదు. జనరల్ 'హెర్స్' యిది విని తెల్లసైనికులను కొందరిని పాండ్యమీదికి పంపాడు. వాళ్ళ చేతులలో మరణించడానికి యిష్టంలేని వీర పాండ్య, తుపాకితో తనను తాను కాల్చుకొన్నాడు. ఆతన్ని ఆస్పత్రిలోచేర్చారు ఆంగ్లేయులు. ఆయనని మిగతా విప్లవ వీరులపేర్లు చెప్పమని నిర్బంధించారు. దానికా వీరయువకుడు వారిపేర్లు బయటపెట్టనని నిర్మొహమాటంగా చెప్పాడు.

పాండ్యాని ఏప్రెల్ ఎనిమిదిన ఉరితీశారు. బారక్‌పూర్ మొత్తంమీద ఆయనని ఉరితీయడాని కెవరూ రాకపోతే కలకత్తా నుంచి మనుషులను తెప్పించి ఉరితీయించారు సీమదొరలు. ఆఖరిక్షణాలలో ఉరిత్రాడు మెడకి బిగుసుకొంటున్నప్పుడు కూడా పాండ్యా మిగతా విప్లవకారుల పేర్లను ఆంగ్లేయులు ఎంత అడిగినా బయటపెట్టలేదు. అంత వీరత్వం ఆయనలో ఉందిగనక పద్దెనిమిదవందల ఏభైవడు స్వాతంత్ర్య సమరంలో ధర్మకోసం పోరాడిన ప్రతివారినికూడా 'పాండ్యా' అని పిలుస్తూండేవారు జనులు. ఆ తరువాత విప్లవకారులు మెల్లిగా ఆంగ్లేయుల నోడించి మీరట్, ఢిల్లీలను వశంచేసుకొన్నారు. మే పదహారుకి ఢిల్లీలో ఆంగ్లేయాధిపత్యం అన్నది లేకుండా పోయింది. స్వాతంత్ర్యపతాక ఢిల్లీ గగనవీధుల్లో స్వేచ్ఛా విహారం చేసింది. విచ్చుకత్తులు పుచ్చుకు స్త్రీలు పురుషులు ధనికులు, పేదలు, వృద్ధులు హిందూ ముస్లిములు వారు వీర నే భేదంలేకుండా అందరూ బానిసత్వంమీద, ఘోరంగా పోరు సల్పారు. ఇటావా, రోహిల్‌ఖండ్, షాజహాన్‌పూర్, మురాబాద్ అంతటా బ్రిటిషు సైన్యాలను దునుమాడి భారతీయులు స్వేచ్ఛాపతాకం ఎగరవేశారు.

ఇంక వారణాసిలో హిందూముస్లిం సిక్కులంతా ఏకం అయి బ్రిటిషువారిని ముప్పతిప్పలుపెట్టారు. పద్దెనిమిదివందల ఏభైవడులో యిలా అందరూ ఏకంఅయి పోరుసల్పిన ఘట్టం 'వారణాసి' అంటూరు సావర్కార్. ఇంక వీరి ధాటికాగలేక

వారిదేశంనుంచి ఆంగ్లేయుల సైన్యాన్ని రావించుకొన్నారు. వారికి నాయకుడు అతి క్రూరాత్ముడు 'నీల్' జనరల్ నీల్ చాలా కోపోద్రిక్తుడై వృద్ధులు, బాలురు, స్త్రీలు గ్రామీణులు అన్న భేదంలేక తన చేతికి చిక్కిన వారందర్నీ ఉరి తీయించేశాడు. ఉరికంబాలు చాలకపోతే చెట్లకివేలాడకట్టి గ్రామస్థులను ఉరితీయించాడు. నాల ్గువైపులా గ్రామానికి నిప్పంటించి అక్కడ ప్రజలందర్నీ సజీవదహనం చేయించాడు. నీల్ ఇన్నివిధాల అమానుషంగా హింసించినా ప్రజలు పోరు మానలేదు. ఇంక తాంత్యాటోపీ, నానాసాహేబ్, ఝాన్సీ లక్ష్మిబాయి, కుమార్‌సింగ్‌లు పద్దెనిమిదివందల ఏభైఏడు సమరంలో పోరాడిన వైనంచూస్తే వారి వీరత్వానికి మనం నివ్వెరపోతాం! వీరు సమరంలో చూపిన అద్భుత ధైర్య సాహసాలకి ఆంగ్లేయులే చాలా అక్కజపడ్డారు. భారతీయుల్లో అనేకులు దేశద్రోహులుగా తయారవ్వడంనుంచి ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామం పరాజయంపొందింది.

అయోధ్యరాజ్యం పద్దెనిమిదివందల ఏభైఎనిమిది జూన్ నుంచి ఏభైతొమ్మిదవ ఏప్రిల్‌దాకా పోరాడింది. అన్ని వైపుల నుంచి ఆంగ్లసైన్యాలు చుట్టుముట్టి నేపాల్‌దాకా తరిమివేశాయి. నేపాల్‌రాజు హిందువైఉండికూడా తోటి హిందూ సోదరులైన ఈ విప్లవకారులను ఆంగ్లేయుల ఆధీనం చేశాడు. అంతేకాక నేపాల్‌రాజు 'జంగ్‌బహద్దర్' తన సేనలను

విప్లవకారులు నణిచేందుకు లక్నోదాకా పంపి చరిత్రలో శాశ్వతమైన అపకీర్తిని సంపాదించుకొన్నాడు దేశద్రోహాని.

నేపాల్ రాజులాంటి మరో దేశద్రోహి 'మానసింగ్' తాంత్యాటోపీ మరణానికి కారణం అయ్యాడు. తాంత్యాటోపీ ఎంతగా ధైర్యస్థైర్యాలుచూపి పోరుసల్పినా దురదృష్టవశాత్తు జయం మనపక్క లేకపోవుటచే తాంత్యా రెండు గుర్రాలని, ఒక సేవకుడిని తీసుకొని గ్వాలియర్ సర్దార్ 'మానసింగ్' వద్దకు వచ్చాడు. తాంత్యా మానసింగ్‌తో ఉన్నాడని ఆంగ్లేయులకి తెల్సింది. అయినా అతన్ని ధైర్యంగా పట్టుకొనిపోవడానికి ముందుకు రాలేకపోయారు. దానితో కుటిలబుద్ధితో మాన సింగ్‌కి చాలా ఆశచూపారు. 'నార్మల్' రాజ్యం అతనికి ఇస్తామని తాంత్యాని వశంచేయమని. ఈ కుటిలాత్ముడు ఆ లంచాని కాశపడి తన నీడన సుఖంగా నిద్రిస్తున్న తాంత్యాని అర్ధరాత్రివేళ సైనికులచే బంధింపచేసి 'సిప్రి' లోని జనరల్ 'మేడ్' శిబిరానికి తీసుకువెళ్ళాడు. పద్దెనిమివందల ఏభైతొమ్మిది ఏప్రిల్ నాటికి తాంత్యాని విచారణజరిపి ఉరిశిక్ష విధించా రాంగ్లేయులు. తాంత్యా గంభీరంగా ఉరికంబమెక్కి తానే ఉరిత్రాడును స్వయంగా మెడకి తగిలించుకొన్నాడు చిరు నవ్వుతో. సావర్కార్ తాంత్యానిగూర్చి యిలా వ్రాస్తారు: "ఆంగ్లేయ ప్రేక్షకులు కొంతమంది తాంత్యా స్మృతిచిహ్నంగా అతని కేశాన్ని సంపాయించుకొనేందుకు అతని శరీరం మీాదికి

ఎగబడ్డారని." ఉరితీశాక శత్రువుచేతనైనా పొగడబడ్డవీరుడు తాంత్యా.

సంస్థానాధీశులలో కచ్, బుందేల్ ఖండ్, గ్వాలియర్, ఇండోర్ లు అవలంబించిన తటస్థవిధానంకూడా, ప్రథమ భారతస్వాతంత్ర్య సమరాన్ని వెన్నుపోటుపొడిచింది. వీరు ఆంగ్లేయుల పక్షం నెగ్గేలావుంటె అటు మొగ్గడం విప్లవ కారులపక్షం నెగ్గేలావుంటే యిటు మొగ్గడం వంటి, అవకాశ ధోరణి నవలంబించారు స్వార్థపూరితులై. అలాకాక, వీరం దరు, విజయమో, వీరస్వర్గమో అని సమరంలో ధైర్యంగా ఒక్కతాటిమీద నిలబడితే తప్పక స్వరాజ్యం సిద్ధించేదే. ఇంక పాటియాలా సంస్థానము బహిరంగంగానే దేశద్రోహుల జాబితాలో చేరిపోయింది. భారతదేశపు అస్థిత్వం చాలా భాగం తన చేతిలోపెట్టుకొన్న హైదరాబాదు నవాబుకూడా ఆంగ్లేయులలో కలసిపోయాడు. విప్లవానికి పెద్దదెబ్బ అయింది. ఇంక ఢిల్లీ పాదుషా విప్లవంకాస్త సన్నగిల్లేసరికి భయపడి ఆంగ్లేయులకి "దాసోహం" అన్నాడు. పెద్దవారందరూ ఇలా పిరికిమందుతిని దేశద్రోహులైనా చిన్న సంస్థానాధీశుడైన జగదేశ్ పూర్ పాలకుడు, ఎనబదేళ్ళ వృద్ధుడు. "కుమార్ సింగ్" అత్యంత సాహసంతో బ్రిటిషువారిని చివరికంటా ఎదుర్కొన్నాడు. యుద్ధచేస్తుంటె ఆ మహావీరుడికి ఓ చెయ్యి తెగిపోయింది. అయినా ఆతడు అత్యంత సాహసంతో, తెగి పోయిన తన కుడిచేతిని, మణికట్టుదాకా నరికేసి "అమ్మా! గంగాభవానీ! నీ ప్రియసుతుని ఈ ఆఖరికానుక స్వీకరించు,

అంటూ గంగానదీమతల్లి కా చేతిని అర్పించేశాడు. యుద్ధ రంగంలో అలా ఒంటిచేతితోనే పోరాడి కొనప్రాణంతో వుండగా ఇంక శత్రువులచేతికి చిక్కకుండా ఆ మహావీరుడు, తన రాజధానికివెళ్లి తన స్వేచ్ఛాసింహాసనమందే ప్రాణం వదిలాడు.

అలాగే రాణీ లక్ష్మీబాయి ఆమె చెలికత్తెలు అజీ జీన్ అనే ముస్లిం యువతి యుద్ధరంగంలో, చూపిన ధైర్య శౌర్యాలు అసమాన్యమైనవి. రాణీ లక్ష్మీబాయి సమరంలో, కుడికన్ను, కుడిచెయ్యి తెగిపోయినా, వొళ్ళంతా దెబ్బలతో రక్తసిక్తం అయిపోయి, మృత్యుముఖంలో వుండికూడా, తనని తీవ్రంగా దెబ్బతీసిన ఆ శత్రువుని హతమార్చిగాని, ఇవతలకి రాలేదు. ఆమె ఆంగ్లేయుల కంటపడకుండా, తమ నౌఖరు సాయంతో, ఆ ప్రక్కనేవున్న కుటీరంలోకివెళ్లి అక్కడే పచ్చికమీద స్వతంత్రంగా తుది శ్వాస వదిలింది. ఆమె కోరికప్రకారం ఆమె శరీరాన్ని ఆంగ్లేయుల స్పర్శచే అప విత్రం కాకుండా, గుట్టుగా అంత్యక్రియలు జరుపబడ్డాయి. ఇలాంటి అసమాన వీరయువతినిగూర్చి సావర్కార్ ఇలా అంటారు: "ఇరవయిమూడు ఏళ్ళకు మించని యువతి, గులాబీ వంటి సుకుమారి, ముచ్చటైన ప్రవర్తన పవిత్రమైన శీల ముతో, పురుషులలోకూడా ఎంతో తక్కువమందికిగాని సాధ్యంకాని విధంగా ధైర్యసాహసాలుచూపి సమరంలో పోరాడింది. ప్రజల అభిమానాన్ని ఎంతగానో చూరగొంది.

అలాంటి దైవీవ్యక్తిత్వంగల రాణిని పొందే భాగ్యం చాలా అరు" దని.

ఆఖరికిమాటగా సావర్కార్ ప్రథమ స్వాతంత్ర్య సమరాన్నిగూర్చి ఇలా అంటారు: "పద్దెనిమిదివందల ఏభయి ఏడు మహావిప్లవం- దాని పరాజయం బాధ్యత సోమరులు, నపుంసకులు, స్వార్థపరులు, దేశద్రోహులైన వారిది. కాని స్వీయరక్తంతో, తమ ఖడ్గాలని తడిపి, అగ్నిజ్వాలలోకురికి, మృత్యుదేవత ఎదుట స్వైరవిహారంజరిపిన వీరయోధుల అలసత ఎంతమాత్రంకాదు. వారిలో కించిత్తు అల్పగుణంలేదు. పరాజయానికి కారణం వారి తొందరపాటు ఆలోచనలేమీా కాదు.

ఇంక ప్రజలలోకూడా ఆంగ్లరాజ్య విధ్వంసానికి వ్యతిరేకత వున్నమాట నిజమే. కాని భవిష్యత్తుకి సంబంధించిన ప్రజల హృదయాలని రంజింపచేయగల మహాలక్ష్యాలను వారి ముందువుంచి నట్టులేవు. అలాఅయితే విప్లవం ఎంత చక్కగా ప్రారంభం అయిందో అంత చక్కగా ముగిసేది. మనం నెగ్గితే మటుకు, మళ్ళీ అదే మొగలుల పరిపాలన, స్వదేశీరాజుల కలహాలు, తమ ఇక్కట్లు అలాగే వుంటాయని ఈ పరిస్థితులకి విసుగెత్తిజాలి ఉదాసీనం వహించి అనుకున్నంతగా ఆత్మబలిదానం చేయలేదని" సావర్కార్ అంటారు.

అమరవీరుడైన సావర్కార్ రాసిన ఈగ్రంథం ముద్రింపబడక పూర్వమే, బ్రిటిషువారిలో తీవ్రమైన భయాన్ని కల్గించింది. అందుచే మనదేశంలో ఈ పుస్తకం, ముద్రించ

డాని కెవరూ సాహసించలేదు. విదేశాల్లోకూడా ఎవరూ సాహసించలేకపోయినా, ఆఖరికి "హాలెండు"లో దాని ప్రథమ ముద్రణ జరిగింది. రహస్యంగా ఈ పుస్తకం దేశభక్తుల చేతుల్లోకి జారుకుని, వారిలో అత్యంత వీరత్వాన్ని కల్గించింది.

"సిపాయిల పితూరీ" అని తేలికమాటల్తో, ప్రథమ భారత స్వాతంత్ర్య సమరాన్ని కప్పిపుచ్చారు. బ్రిటిషువారు పాలించే రోజుల్లో సావర్కార్ ప్రథమస్వాతంత్ర్య సమర యదార్థ విషయాలని అనేక శ్రమలకోర్చి సేకరించి ధైర్యంగా రాశా డంటే, ఆతని కార్యదీక్ష, ధీశక్తి ఎంతటివో కదా!

ఈ పుస్తకం ఇంటింటా, పాఠశాలల్లో, లైబ్రరీలలో ఉండవల్సిన అర్హతగలది. దురదృష్టవశాత్తు ఈ పుస్తకం ఈనాడు వుండవల్సినంత వ్యాప్తిలోలేదు. నేటి స్వాతంత్ర్య వీరులను స్వరాజ్యసంగ్రామాన్ని మనం తల్చుకొనే ముందు అంతకుపూర్వమే, మనకు శాటలువేసి వుంచిన ప్రథమ భారత స్వాతంత్ర్య సంగ్రామవీరులను ఆ సంగ్రామం జరిగిన "మే ముప్పది ఒకటవ" తేదీని మనం విస్మరించరాదు. ఆనాడే ఆ దేశభక్తుల ఋణాన్ని కొంతవరకైనా తీర్చుకుంటాం!"



# శ్రీ శ్రీ కవిత్వం

"కవితలో శిల్పంలో పురుగులో పుష్పంలో,
సౌందర్యం ఆరాధించేవాడా
ధర్మస్థాపనకు యుద్ధంచేసేవాడా
ఆదర్శజీవి, మాహాత్మ మానవుడా"

"కృష్ణశాస్త్రి తనబాధను అందరిలోను పలికిస్తే శ్రీశ్రీ అందరి బాధను తనలో పలికిస్తాడు" అంటాడు చలం. శ్రీ శ్రీ మహాప్రస్థానానికి ముందుమాటలో, నిజమే మరి. గురజాడ, శివశంకరస్వామి, కృష్ణశాస్త్రి మరింకా కొందరు పెద్దలు భావకవితకు బాటలు వేసినవారే. కాని కవితలో ఒక "మహా విప్లవం" తెచ్చినవాడు శ్రీశ్రీ. ఊహాజగత్తులో వుండి ప్రేయసి వర్ణనలు ఏవో సౌందర్య వర్ణనలు చేసుకుంటూ మునిగి పోవడంకాక సామాన్యప్రజానీకం బాధను ఇంకా చెప్పవలసి వస్తే లోకంలోని పీడితప్రజల బాధలు అన్నీ తనవిగాచేసు కొని ఎలుగెత్తి పలికాడు శ్రీశ్రీ. అందుకే అతను నిజమైన ప్రజాకవి, అభ్యుదయకవి.

"మరో ప్రపంచం మరో ప్రపంచం పిలిచిం"దని హెచ్చ రిస్తూ దారిపొడుగునా గుండెనెత్తురులు తర్పణచేస్తూ "పదండి ముందుకు పదండి" అంటూ మన్ని హెచ్చరిస్తాడు. స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు ఒట్టికబుర్లు చెబితే రావు. దానికి ఆత్మబలి

కావాలంటాడు. అవును స్వంతంత్రం కావాలంటే త్యాగాలు చెయ్యాలి. "నదీనదాలు కొండలు ఎడారులా మనకడ్డంకి కావు మనకి, సమతా రాజ్యస్థాపనలో" అని ప్రోత్సహిస్తాడు.

శ్రీ శ్రీ కవిత్వంలో ఎంత విప్లవం ఉందో పరిశీలించి చూస్తే అంతకన్నా మార్దవం రసహృదయం కనిపిస్తుంది చూడండి ఈ గేయంలో.

"భవభూతి శ్లోకాలు పరమేష్ఠిజూకాలు నా మహోద్రేకాలు, నాఊహ చాంపేయమాల, రసరాజ్యడోల." ఒకే కవితలో ఒకే పెంపు ఎంత ఎంతభుగభుగలు, సెగ సెగలు, చూపిస్తాడో మరో వెంపున అంత మలయమారుతం కురిపిస్తాడు. "రంరంగుల చుక్కలన్నీ రాలి నెత్తురు కక్కుకుంటూ పేలిపోతాయి." అంటూ మరో వెంపున "నేను సైతం ప్రపంచాబ్జపు తెల్లరేకై పల్లవిస్తాను. నేను సైతం విశ్వవీణకు తంత్రినై మూర్ఛనలు పోతాను" అంటాడు.

శ్రీ శ్రీ కేవలం అభ్యుదయ కవిత్వం, వచన కవిత్వం పేరట ఏవో గేయాలురాసే మామూలు మనిషికాడు. మహా పండితుడు. ప్రాచీనకవితను, నవీనకవితను బాగా పఠించిన వాడు. అందుకే అతని శబ్దాలలో ఎన్నో అందమైన సంస్కృత తెలుగు సమాసాలు కనబడతాయి. ప్రాచీనతను నవీనతను కూడా ఉపమానాలుగా తీసుకుంటాడు. "యముని మహిషపు లోహఘంటలు మబ్బుచాటున ఖణేల్ మన్నాయి, ఉదయ సూర్యుని సప్తహయములు నురుగులెత్తే పరువు పెట్టేయి"

అంటూ అది సూకర వేదవేద్యుడు, ఘుర్ఘరిస్తూ కోరచాపాడని మన దేవతలను ఉదాహరణంగా తీసుకుంటూ ఆఖరుపాదంలో బాధలోంచే క్రొత్తసృష్టని "మార్క్స్" వాదాని కనుగుణంగా "పుడమితల్లికి పురిటినొప్పులు కొత్త సృష్టని స్ఫురింపించాయి" అంటాడు.

"కవితా ఓకవితా" అన్న శ్రీ శ్రీ గేయం ఎంతో లావణ్యంతోకూడి అర్థవంతంగా ఉంటుంది. కవితా సరస్వతి సాక్షాత్కరించాలంటే ఎంతెంతతపన తపసు అవసరమో దీంట్లో నిర్దేశించాడు. చిరదీక్షాతపస్సమీరణాలో నిశ్చలసమాధిలో స్వర్గద్వారపు తోరణం వ్రేలిన నామస్తిష్కంలో ఏ ఏ ఘోషలు, భాషలు, దృశ్యాలు – అంటూ ఆయన చూచిన దృశ్యాలను ఇలా వర్ణిస్తారట. అవి ఆకాశాన్ని చుంబించే దివ్యసౌధాలు గూర్చి నఖశిఖపర్యంతం కచకుచ వర్ణనలు చేసే, సుందరీమణులుగూర్చి కావు "వైద్యశాలలో శస్త్రకారుని మహేంద్రజాలంతో చావుబ్రతుకుల సంధ్యాకాలంలో కన్నులుమూసిన రోగార్తునిస్పందన" ఇంకా ఆకలిబాధకు సహించలేక "కడుపు దహించుకుపోయే పడుపుకత్తె రాక్షసరతిలో అర్ధనిమీలితనేత్రాల భయంకర బాధల పాటల పల్లవి చూసాడు". ఇది నగ్నసత్యం. "ఆ పురి వేశ్యలు రంభా ఊర్వశులను తలదన్నేరు." వారు కుసుమాస్త్రనిబాణాలు. ఈ రూపాన్ని చూడలేదు, వారకాంతలలో, శ్రీ శ్రీ దారిద్ర్యానికి తట్టుకోలేక శరీరాన్ని మనస్సుని తాకట్టుపెట్టుకుని కేవలం

డబ్బుకోసం ఎటువంటివాడి పాదాలకిందనైనా నలిగి వాడి పోయే రాక్షస రతి, వేశ్యలలోని బాధ చూపించారు.

ఏ కవి అయ్యా! తరతరాలుగా, దగాపడిన పడుపు కత్తె స్థితిని ఇంతదయనీయంగా వర్ణించాడు. పుంఖాను పుంఖాలుగా సమాజంలో ఎన్నో దృశ్యాలు అతని కళ్ళకు కనబడుతూంటే వాటిని తెల్పడానికతను వ్యాకరణాల సంకెళ్లు విడిచి, ఛందస్సుల, సర్పపరిష్వంగాలు వదిలిపెట్టారు. ఔను అతని కవితా నదీప్రవాహావేగం ఎల్లలను అడ్డంకులను అధిగ మించి ముందుకు తోసుకుపోతోంది. ఐతే అంతమాత్రాన అతని కవిత ఉత్తమ కవిత్వానికి కావలసిన లక్షణాల్ని వదిలి పెట్టలేదు. తనని పునీతంకావించిన ఆ కవిత ఇలాంటిది. "లలిత లలిత కరుణామహితా" అనుపమితా! ఓహో; రసధుని మణిఖని జననీ ఓ కవితా" అంటూ ఎంతోసౌందర్యభావంతో కవితను స్తుతించారు. అందుకే శ్రీ శ్రీ అంతటివాడిచే సమకాలిక సమ స్యలకు "స్వచ్ఛస్ఫటికాఫలకం కవితాసతి నొసట నిత్యరస గంగాధర తిలకం" అని కీర్తించబడ్డ (శ్రీ) బాలగంగాధరతిలక్ కవిత్వం అంటే 'కాళిదాసుకు తెలుసు, పెద్దనకు తెలుసు, శ్రీ శ్రీ కి తెలుసు, కృష్ణశాస్త్రికి తెలుసు' అంటారు.

" ఏదేశ చరిత్రచూసినా ఏమున్నది గర్వకారణం నరజాతి చరిత్ర సమస్తం పరపీడన పరాయణత్వం" అని వాపోయిన ఈ కవి అంతటితోనే ఊరుకోక పరపీడన హెచ్చు

తగ్గులులేని అందమైన సమాజం వస్తుందని మనకు హామీ ఇస్తారు. "స్వాతంత్ర్యం సమభావం సౌభ్రాత్రం సౌహార్దం పునాదులై ఇళ్ళు లేచి జనవాళికి శుభం పూచి, శాంతి శాంతి, కాంతి కాంతి, జగమంతా జయిస్తుంది. ఈ స్వప్నం నిజమౌతుంది. ఈ స్వర్గం ఋజువౌతుంది" - అంటారు. శ్రీశ్రీ కవితా ఖడ్గానికి ఒక వెంపు పదును ఒక వెంపు లాలిత్యం ఉంది. బాధ వ్యక్తంచేసేటప్పుడు ఎంతగా పదాలను ఈటెల్లా విసురుతారో సంతోషాన్ని వ్యక్తంచేసేటప్పుడు ఆ పదాలే నవమాలికలై విహరిస్తాయి.

ఈ తరంలోని అభ్యుదయ కవులందరికీ మార్గదర్శకుడు మహాకవి శ్రీ శ్రీ.



# సాహితీ జగత్తు

ఈ సంసార విషవృక్షానికి రెండేరెండు అమృత ఫలాలంటారు పెద్దలు. ఒకటి సజ్జనసాంగత్యం, రెండు కావ్య రసామృతపానం. అవును! నిజమేమరి : అన్నమయకోశం తృప్తి పడ్డాక మానవుని మనస్సు ఆనందమయకోశంవద్దకు పరుగులిడుతుంది. అలాంటి ఉత్తమమయిన ఆనందం మనం పొందాలంటే సాహిత్యాన్నాశ్రయించక తప్పదు.

ఉత్తమ రచయిత బంగారుకలనుండి వెలువడే ఆ సాహితీసుధ అనేక సమస్యలతో విసిగి వేసారిపోయే పాఠకుల పాలిటికి నిజంగా మధువే!

అయితే ఉత్తమ రచయితకింద రూపొందడానికి జన్మతః వచ్చిన కళాసంపదే కాక విశేషకృషి అవసరం. రచయిత మానసిక సంతానం కావితాకన్య గనుక అతని మనస్సు ఎంత సత్యం శివం సుందరంతో అలరారుతూవుంటే అతని రచనలు అంత బాగుంటాయి. సుప్రసిద్ధరచయిత శ్రీ శరత్ బాబు ఇలా అంటారు. "రచయిత హృదయం ఓసుందర పుష్పగుచ్ఛంలా అలరారి నప్పుడే అతని రచన సజీవంగా ఉంటుందని, ఐశ్వర్యవంతుడు తన ధనాన్ని మితంగా వ్యయం చేయడం ఎలా అవసరమో, చక్కని రచయితకూడా తన రచనాసంపదను అలా జాగ్రత్తగా పొదుపుగా ఖర్చుపెట్టుకోవాలని" అంటారు.

రచయిత అలా జాగ్రత్తగా తూచితూచి ఎంత మటు కవసరమో అంతమట్టుకే వాడుకుంటూ తనకున్న ఈ రచనా సంపత్తిని మితంగా వ్యయంచేసుకోవడం మిక్కిలి దోహదకారి. అతను రసామృతంలేని గ్రంథాలు చాలారాసేకన్నా రసాను భూతి కల్గించే గ్రంథం ఒక్కటిరాసినా అది రచయిత పేరుని ఆచంద్రార్కం నిలుపుతుంది అందుకే కావ్యామృతం రసం అంటాడు "భరతుడు". అయితే నేడు అన్ని రంగాలలాగ సాహితీరంగంకూడ వ్యాపారరంగం అయిపోయింది. ఓవిధంగా ప్రజల బలహీనతలను రెచ్చగొట్టే చవకబారు శృంగారనవల లకే హెచ్చుగిరాకి లభిస్తోంది. దీనివల్ల ఏకాస్తో ధనం రచ యితలకు లభించినా, విశేషంగా పుస్తక ప్రచురణకర్తలు లాభాలు సంపాదించినా సమాజంమట్టుకు నష్టపడుతోంది. నవరసాలలో ఏ రసంతీసుకు రచించినా అది ప్రజలలోని ఉత్తమగుణాలను పెంపొందించేందుకు సహాయకారి కావాలి. రచయిత ప్రభావం పాఠకులమీద విశేషంగా వుంటుంది గనుక తన రచనలు సమాజాన్ని మంచిమార్గంవేపు ఎంత వరకూ తీసుకెళ్ళగలుగుతున్నవో రచయిత గమనించుకోవడం చాలా అవసరం. సుప్రసిద్ధ ప్రాచీన కవి "దండి" ఇలా అంటారు — "వాక్యానికి గుణం ప్రాణం" అని.

నేడు కథలు, నవలలు విశేషప్రచారంలో వున్నాయి. పండిత పామరభేదం లేకుండా పిన్నలు పెద్దల భేదంలేకుండా సూటిగా మనస్సుల్లోకి చొచ్చుకుపోయే శక్తి వీటికుండడమే దీనికి కారణం. మన రచయితలు సాంఘిక సమస్యల్ని

స్పృశిస్తూ సమాజాభ్యుదయానికి దోహదంచేసే కథలు, నవలలే ఎక్కువ వ్రాయాలి. అయితే నేడిలాంటివారు చాలా తక్కువగా ఉండటం దురదృష్టం!

సమాజంలో కల్మషాన్ని చట్టాలు, దండనలు పూర్తిగా నివారించలేవు. కాని రచయిత తన రచనలవల్ల సమాజంలోని కల్మషాన్ని కడిగివేయగలడు. కందుకూరి, గురజాడ వంటివారి ప్రభావం సమాజంమీద ఎంతవున్నదో మనందరం గుర్తెరిగిన విషయమే. సుప్రసిద్ధ ప్రాచీన ధ్వన్యాలోకన చక్రవర్తి శ్రీ ఆనందవర్ధను లిలా అంటారు - "ఈ కవితా జగత్తుకి బ్రహ్మ కవే. అతనికి లోకాన్ని తన సంకల్పానికి అనుగుణంగా మార్చేశక్తి ఉంది. అతడు తన రచనలో శృంగార రసాన్ని పోషిస్తే జనులందరూ ఆ రసానుభూతి పొందుతారు. అతడు వీరత్వాన్ని తన రచనలో చూపించి ప్రజలను వీరులుగా చేస్తాడు. ఇలా అతను తన ప్రతిభచే ఎలాంటి శిలాసదృశమైన వస్తువులనైనా ద్రవింప చేస్తాడు."

నిజమే మరి! ఆ వాణీ చరణనూపుర ధ్వనిలో విషాదం, కరుణ, రౌద్రం, బీభత్సం, శృంగారం- ఇలా నవ రసాలను మధురంగా వ్రాసి పాఠకులను సమ్మోహన పరిచే రచయిత సృష్టికర్త కేమాత్రం తీసిపోడు. జనాన్ని రసానందంలో ముంచేందుకు సాహిత్యంలోని అన్ని ప్రక్రియలు వాడుకోవచ్చు. సుప్రసిద్ధ అమెరికన్ రచయిత శ్రీ కారల్ శాండల్‌బర్గ్ ఇలా అంటారు - "రచయిత అన్నవాడు తనకు తోచిన విధంగా రాస్తాడు. కాని కవితను ఏది విధిగా వ్రాయడం అవసరం అనుకుంటాడో దాన్నే రాస్తాడంటూ

ఆయన ఇంకా ఇలా అంటారు - "తలుపు తెరవడం మూయడం లాటిది కవిత్వం. తలుపుమూసి తెరచే వ్యవధిలో దాన్ని అవలోకనం చేసేవారికి ఏమి గోచరిస్తుందో అది కవిత్వం" అంటారు. శబ్దాన్ని అర్థాన్ని అందంగా పోషిస్తూ పాఠకుల మనస్సులో చిరకాలం హత్తుకుపోయేలా రచనలు చేయగల నేర్పు రచయితకివుంటే అతను ఏ సాహిత్యప్రక్రియలోనైనా ప్రజలను రంజింపచేయగలడు. అందుకే "శబ్దార్థాల జంట కావ్యమ్" అని శ్రీ రుద్రటుడు అంటారు.

రచయితకు వివిధ విషయగ్రంథపరిజ్ఞానం పాండితీగరిమ వుండటం చాలా అవసరం. మన పూర్వ రచయితల గ్రంథాలు, దేశ విదేశ సాహిత్యం, ఆధునిక సాహిత్యం అతను ఆకళింపు చేసుకోవాలి. ఆ తరువాత అతను తనదైన స్వతంత్రమార్గం ఎన్నుకోవాలి. మన సంస్కృతంలో ఎన్నో జ్ఞాన, వైద్య, లాక్షణిక గ్రంథాలున్నాయి. ఈనాటి నవీన శాస్త్రజ్ఞుల్నికూడా విస్మయుల్నిచేసే అపూర్వ సత్యాలని కొన్నివేలయేళ్ళ క్రితం ప్రవచించారా రచయితలు, ఆ గ్రంథాల్లో. కాని ఈనాడు సంస్కృతభాష తెలిసినవారు చాలా తక్కువమంది ఉండుటచే మనం ఆ రచనల గొప్ప తనాన్ని తెలుసుకోలేక పోతున్నాం.

కనుక అలాంటి ఉత్తమ గ్రంథాల్ని పండితులు విరివిగా దేశభాషల్లోకి అనువదించాలి. అవన్నీ పాఠకులు పఠించి వాటిలోని సారాన్ని గ్రోలాలి. ఆనాడు భారత కవితాకన్య నవనవోన్మేషమైన కుసుమాలతో వికసిస్తుంది.

# సాత్రాజితి

"సత్యభామ ఎక్కడుంది? అందమైన ఆడవాళ్ళ కళ్ళలోనా? అభిమానవంతుల అంతరంగంలోనా? గాయపడిన హృదయాలలోనా? వీళ్ళందరిలో ఈనాటికీ జీవించే ఉంది." అంటారు శ్రీ అవసరాల రామకృష్ణారావు. ఔను! సత్యభామ వీళ్ళందరిలో ఉంది! అనురాగవతి, అభిమానవతి. అభిమానం నిలుపుకోగల్గిన ధైర్యసాహసవతి, సత్యభామ పురాణప్రబంధ కావ్యాల్లో ఒక విలక్షణపాత్ర. ఆమె పాత్ర లక్షణాలన్నీ ముక్కు తిమ్మన పారిజాతాపహరణంలో సమగ్రంగా సరసంగాచిత్రింపబడినాయి. సరసులు మనుచరిత్రలోని, వరూధినీ ప్రవరాఖ్య ఘట్టాన్ని ఎంత ఆసక్తిగా చదువుతారో, పారిజాతాపహరణంలోని సత్యభామాపాత్ర విశిష్టత చూపే ఘట్టాన్ని అంత ఉత్సాహంతో చదువుతారు. సత్యభామ పాత్రచిత్రణలో ముక్కుతిమ్మన చూపిన అందాల్ని పరిశీలించడం ఈ వ్యాసం యొక్క లక్ష్యం.

ఒక రోజు సత్యభామ తన కేళీవనంలో అమర్చబడిన గిరిపొంత, పూల తేనియ కాలువగా పారుతున్న చోట చంద్రకాంతశిలా వేదికమీద, ఎఱ్ఱకలువపుప్పొడి చల్లబడినచోట సఖులతో కూర్చొని సరససల్లాపాలాడుతూ, కృష్ణుని చర్యలు చెప్పుకొంటూవుంటుంది. సత్యభామ చెలికత్తెలలో ఒకామె రుక్మిణి యింట్లో సి. ఐ. డి. ఆమెను సత్యభామ మనస్తత్వానికి తగిన

చెలికత్తెగా చూచి రమ్మంటే తాను చూచినదానికి పది కల్పించి సత్య మనస్సుని ఆకట్టుకునే మాటకారిగా తిమ్మన చిత్రిస్తాడు. చెలికత్తె పాత్రని కూడ చాలా నిపుణతతో నిర్మిస్తాడు కవి. చెలికత్తె వచ్చి కంగారుగా ఇలా అంది. "అమ్మా! అమ్మా! నారదుడు వచ్చి, దేవలోకపు పారిజాతపుష్పాన్ని తెచ్చి, కృష్ణుడితో రుక్మిణికిప్పించి పైగా నిన్నుగూర్చి ఏమన్నారో తెలుసా అమ్మా!

"పతిగూడ్చుదాన నా అంతటివారు లేరని
అహంకృతి నెప్పుడు విఱ్ఱవీగు"
"సత్యగరువంచికచెల్లదు..." అన్నారమ్మా!

ఈ పైనచెప్పిన పదాలలో ప్రతి ఒక్కటి సత్యభామ సహజగుణాల్ని వ్యక్తపరుస్తున్నాయి. మగడు తననే అందరి కంటె ఎక్కువ ప్రేమిస్తున్నాడనే గర్వం ఆమె పాత్రలోని ముఖ్యాంశం. ఆమాట వింటే ఆమెకి ఎంత కోపం వస్తుందో చెలికత్తెకి తెలుసు. ఆమెకి బాగా కోపం తెప్పించి, ఆమెకూ భర్తకూజరిగే ప్రణయసమరాన్ని చూచివినోదించడంచెలికత్తెకి బహుశా ఒక ఆటఅయి ఉంటుంది. చెలికత్తె మాట వినగానే సత్యభామ కోపం తారస్థాయి నందుకొంది. ఆమె కోపాన్ని వర్ణించడానికి కవి తెచ్చిన ఉపమానాల్ని, అందమైన పదాల పొందికను చూడండి.

"అనవిని ప్రేటువడ్డయురగాంగనయుం బలె నేయివోయ భ
గ్గనదరికొన్న భీషణహుతాశన కీల యవంగలేచి"

భ_ర్త ప్రవర్తన అనే దెబ్బ తగిలించి చెలికత్తె మాటలు అనే ఆజ్యం పోయబడింది ఆమె కోపాగ్నిలో. వెంటనే ఆమె అసలే పెద్దవైన తన కళ్లు మరింత పెద్దవిచేసి, కనుదోయి కెంపు చెక్కిలి మీదనున్న కుంకుమ పత్రభంగాల ఎరుపు కలిసి నవీన కాంతి కలుగగ, గద్గదఖిన్నకంఠమై ఎన్నోవిధాలుగావిలపిస్తుంది. ఆ మాటల్లో మాత్సర్యవతియైన స్త్రీమాటల్ని అతి సహజంగా పొందుపరుస్తాడు తిమ్మన.

"ఆ పువ్వును చాలా మహిమ కలదని పెద్దచేసి, జడదారి కృష్ణుడికి ఇచ్చకాలకోసం యిస్తే యిచ్చాడు! మధ్యలో మమ్మల్ని (రాజసం)నిందించడం ఎందుకు?కృష్ణుడు ఎలా ఊరుకున్నాడు?" అంటుంది. తాను నరకాసురవధ ఘట్టంలో అతనికి మేలు చెయ్యడం మరచిపోయాడు. కృతఘ్నుడని నిందిస్తుంది.

"పూనుకొని మేలుగీళ్ళకు
లోనయి విహరించు వారి లోకమెరుగదో
యా నరకాసుర దమనుఁడు
తా నెఱుగఁడో! భోజకన్య తా నెఱుగదో!

అంటుంది. (సత్యభామ నరకాసురుడితో యుద్ధం చేసి అతనిని ఓడించటాన్ని నాచనసోముడు, అందంగా వర్ణించాడు. నాచనసోముని పద్యం చూద్దాం.

"అరిజూచున్ హరిజూచుచూచుకము లందంద మందారకే
సరమాలామకరందబిందు సలిలస్కందంబు లందంబులై
తొరగన్ బయ్యెదకొంగొకింత తొలగన్ దోర్మూలశరాసారమున్
దరహాసామృతపూరమున్ గురియగన్ తన్వంగిహేలాగతిన్.
[ఉత్తర హరివంశము]

ఇంక పోతనగారు సత్యభామ నరకాసురుడితో యుద్ధం చేయడాన్ని గూర్చి ఎంత అందంగా వర్ణించారో చూడండి.

"వేణిన్ జొల్లెము వెట్టి సంఘటితనీవీబంధయై" అంటూ ఇంకో పద్యం ఇలా అన్నారు.

"వీర శృంగార భయ రౌద్ర విస్మయములు
గలిసి భామినియయ్యెనో, కాకయునఁగ
నిషువుఁ దొడుగుట దివుచుటయేయు టెల్ల
నెఱుఁగరాకుండ సని సేసె నిందువదన"

దుష్టుడైన నరకాసురవధలో ఎంతో సాయపడిన సత్యభామ శౌర్యం త్రిజగన్నుతం. అందుకే పోతనగారు, ఎన్నో పద్యాలలో వర్ణించి ఇంకా తనివితీరక ఇలా అన్నారు.

"త్రిజగదభిరామ, గుణధామ, చారుసత్యభామ" అని లోకకంటకుడైన నరకాసురుణ్ణి సత్యాకృష్ణులు వధించి జనులకు ఆనందం కలుగజేశారు. ఆ ఆనందానికి చిహ్నంగా ఈనాటికీ మనం దీపావళి జరుపుకుంటున్నాము.

ఎంతో కోపంగా మాట్లాడిన సత్యభామ చివరికి స్త్రీ సహజంగా వాపోవడాన్ని కవి ఎట్లు రాస్తాడో చూడండి.

"ధనమిచ్చిపుచ్చుకొన్నను
మనమున నొర్వంగవచ్చు
మగ డింతులకున్ చనువిచ్చి పుచ్చుకొన్నను
మనవచ్చునె..." అంటూ.

విపరీతమైన కోపం వచ్చిన సత్యభామ రాత్రికి కోప గృహంలో చేరుతుంది. కోపానికి అనుగుణమైన వేషం ధరిస్తుంది. ముక్కుతిమ్మన ముద్దుపలుకుల తీయదనమంతా ఆమెను వర్ణించడంలో ప్రదర్శిస్తాడు. ఆమె వేషం యిలా ఉందిట.

"మాసినచీరగట్టుకొని మానముతోడ నిరస్తభూషయై
వాసెనకట్టుగట్టి నిడువాలిక కస్తురిబొట్టువెట్టి లో
గాసిలి చీకటింట కడకంకటిపై జలదాంతచంద్రరే
ఖాసదృశాంగియై పొరలె గాఢమనోజవిషాదవేదనన్.

మరి కాసేపటికి శ్రీకృష్ణుడు సత్యభామా గృహంలో ప్రవేశించాడు. ఈవిడ చెయిదం అంతా చూసాడు. తాను చేసిన పనులు తెలుసు, భామ అలుకకు కారణము తెలుసు. అయినా ఈవిడ అలుకకు కారణము ఏమియు తెలియనట్టు, "ఇందునిభాస్యం మైతొడవు లేల ధరింపవు" అని పలుకరిస్తాడు ప్రియంగా. నవ్వులాటకిలాగ వున్నావా? లేకపోతే నిజంగా నావలన తప్పు జరిగిందా? చెప్పు" అంటాడు. అయినా ఆవిడ ఏమీ పలకదు. అప్పుడు ఆ "కుహనాగోపాలుడు" సాత్రాజి ఇలా బ్రతిమాలుతాడు.

"మనమున మాటలంప్రియుల మన్ననలందొకనాడు నెట్టికా
మినులకు గారవంబు మెఱమెచ్చులకై చరియింతుఁగాని, పా
యని యనురక్తి నీయెడనె యగ్గలమై కనుపట్టునాకు, నీ
పనిచినపంపుసేయుటయ ప్రాభవమాటది నీవెఱుంగవే?

అలా అన్నా ఆ ఇందువదన ఏమీమాట్లాడదు. అప్పుడు పాపం ఆయన భార్యంటే ఆదరం వున్న భర్త గనుక; పెళ్ళాం అంటే తిట్టికొట్టేవాడు కాదుగాబట్టి, స్త్రీ అంటే తేలిక స్వభావం లేదుగనుక ఆవిడని ఎలాగైనా ప్రసన్నం చేసుకొని కోపం పోగొట్టి ఆవిడ ప్రేమ పొందాలని తప్పక క్షమించమని పాదాలకు మ్రొక్కుతాఁడు. ఆ పద్యంలో అందం కొంత చూద్దాం.

"మృదుపల్లవకోపల తత్పదద్వయీ
పాటలకాంతి మౌళిమణి పంక్తికి వన్నియబెట్ట నాజగ
న్నాటక సూత్రధారి యదునందను డర్మిలి మ్రొక్కె
మ్రొక్కెనన్."

ఆ తరువాత ఆవిడ ఏమిచేసిందో జగత్ప్రసిద్ధమైన ఈ పద్యం ఇదిగో మనకందరికీ తెలుసు. అయినా

"జలజాతాసన వాసవాది సురపూజాభాజనంబై తన
ర్చు లతాంతాయుధు కన్నతండ్రి శిరమచ్చో వామ
పాదంబునన్
తొలగం ద్రోచె లతాంగి" అంటాఁడు తిమ్మనగారు.

సత్యపాదతాడనానికి ఆ కుహనాగోపాలుడు నవ్వుతూ,

"నువ్వు నన్ను తన్నడం నాకు గౌరవమే. ఎందుకంటే నేనెప్పుడూ నీకు దాసుణ్ణే. కానీ, నాశరీరం పులకించి ముళ్ళు కాగా అవి గుచ్చుకుని నీ అందమైన చిగురులాంటి పాదం కందిందేమో!" అని చమత్కారంగా మాట్లాడుతాడు. అటువంటి మాటలు విని కోపం జారిపోని సరసురాలు ఉంటుందా? సత్యభామ లేచి కూర్చొని తన బాధని గూర్చి వివరిస్తుంది. తన గౌరవానికి అతడు ఎంత భంగకరంగా ప్రవర్తించాడో చెప్తుంది. "నీవు నాకు ఎక్కువ చనువివ్వడంచేత దేవకీదేవి నన్ను అందరి కోడళ్లలోకీ పెద్దగా చూస్తుంది ! ఇక ఆవిడ ముఖం నేనెలా చూచేది?" అంటుంది.

ఆనాటికీ, ఈనాటికీ కొడుకు ఎక్కువగా గౌరవించే కోడలినే అత్తగారు కూడ గౌరవిస్తుందన్న సత్యాన్ని కవి ఇక్కడ చెప్తాడు. అంతేకాక తన జీవితమే వృథా అనీ, తాను ఆత్మహత్య చేసుకుంటాననీ సత్యభామ చెప్తూ తన మరణానంతరం తన సౌభాగ్యమంతా ఏసవతికి సంక్రమిస్తుందో అని విలపిస్తుంది. ఇది ఎంత సహజం! సత్యభామ తన రత్నాలు, వజ్రాలు, బంగారం మొదలైన వాటినిగూర్చి బాధపడవచ్చు! కానీ మామూలు స్త్రీకి తన జరీచీరలు, రెండు జతల గాజులు, పందిరిమంచం సవితి వాడుకుంటుందంటే ఎంత బాధ కల్గుతుంది!

"ఉవిద ఎవ్వతె నోచియున్నదో
ఈ శమంతకరత్నమే దల ధరింప

జీవితాంతం నిత్యనూతనమై ఉంటుందేగాని సేవ్యసేవకభావం ఉంటే అది సమానమైన ప్రేమను సూచించదు. సత్యభామా శ్రీకృష్ణుల ప్రేమలోని చమత్కారం యిది. భర్తని ఎలా ఆకర్షించుకోవాలో, అతనిమీద ఎలా కోపగించుకోవాలో, అతణ్ణి తిరిగి ఎలా ప్రసన్నం చేసుకోవాలో, తనమాటని ఎలా నెగ్గించుకోవాలో ఆమెకి తెలుసు. సహృదయులైన భర్తలు ఇలాంటి స్త్రీలకే సంపూర్ణంగా వశమౌతారు. అందుకే శ్రీకృష్ణుడు సత్యభామావిధేయుడు. అటువంటి స్త్రీలలో అపూర్వమైన సముచితమైన అహంకారం ఉంటుంది. అట్టి అహంకారంగల స్త్రీయే ధన్యురాలు. సత్యభామలోని ఈఅహంకారాన్ని. కావ్యంచివరలో ఆమె యింద్రుని ద్వారపాలకుల దగ్గర సవాల్ చేసున్నప్పుడు కవి పూర్తిగా కళ్ళకు కట్టేటట్లు వ్రాస్తాడు.

"పలుకు లేటికి ?
తాను వీరపత్నియేని
మీ శచీదేవి తన ప్రాణేశుడైన
మఘువు నిటబంపి
సత్యభామా విధేయువలన
మరలంగగొనుడెపో! వాసితనము!"

సత్యభామ అబలకాదు సబల! భర్తని దాస్యభావంతో సేవించడంగాక, ప్రేమించి ప్రేమించబడాలని చెప్తూ ఆధునిక మహిళలకి మార్గదర్శకురాలౌతోంది. అటువంటి సత్యభామని చిత్రించిన ముక్కుతిమ్మన ధన్యుడైన మహాకవి!



# యువతరాన్నుద్దేశించి బాపూ

బాపూజీ రామరాజ్యానికి నిర్వచనం చెప్తూ యిలా అంటారు. "అర్ధరాత్రి అయినా నగలతో యావ్వనంలో ఉన్న స్త్రీ నడిచివెళ్తుంటే సురక్షితంగా ఎప్పుడు వుండగలిగే స్థితి వస్తుందో అప్పుడే రామరాజ్యం అవతరణకి గుర్తు" అంటారు. అంతే కాదు. ఈ సందర్భంలో బాపూజీ చెప్పిన ఎన్నో విషయాలుకూడ గుర్తుకు వస్తాయి. ఒక అమ్మాయి తనని రోడ్డు మీద కొందరు రౌడీలు అవమానించారని, ఇలాంటప్పుడు ఏం చేయాలని బాపూజీకి ఉత్తరంరాసింది. ఆయ నిలా అన్నారు. "ఇటువంటి సంఘటనలు జరిగినపుడు దానికి బాధ్యులైనవారి పూర్తి పేర్లతో సహా పేపర్లలో ప్రకటించవలెను. దుర్మార్గాన్ని బయటపెట్టడంలో ఏం బిడియపడనక్కరలేదు. ఇలాంటి దుష్టులకి ప్రజాప్రాతికూల్యంబోలు ఆయుధం వేరొకటి లేదు." అంటూ ఇంకా ఇలాఅన్నారు. ఇంక మనస్త్రీలు కూడ తమ వేషభాషలచే యువకులను ఆకర్షించేలా వుండడం తగదన్నారు. ఇది నిజమే ! నేను ఎంతోమంది వనితలు అందం, అలంకరణ పేరిట అతిపల్చనిబట్టలు వేసుకుంటూ రకరకాలుగా అవయవ ప్రదర్శన చేసుకుంటున్నారు. ఎవరింట్లోవాళ్ళు ఎలావున్నా ఫర్వాలేదు గానీ స్కూలుకి వెళ్ళేటప్పుడు, ఆఫీసులకు వెళ్లే టప్పుడు, బయటకు వెళ్ళేటప్పుడు ఎంతో గౌరవనీయమైన వేషభాషలతో వెళ్ళాలిగానీ, మనప్రవర్తన, అలంకరణ పురుషులని రెచ్చగొట్టేదిగా వుండరాదు.

నేడు యువకులు ఎక్కువగా ఇలా తప్పుమార్గాలు పట్టడానికి మరోకారణంకూడ వుంది. వాళ్ళను ఎక్కువగా రెచ్చగొడుతున్నది అశ్లీలసాహిత్యం, కొన్నిరకాల సినిమాలు కూడాను. పవిత్రమైన విద్యనభ్యసించుటకువచ్చే విద్యార్థుల (కొందరి) ప్రవర్తన ఇలా ఉండడం చాలా విచారకరమైన విషయం. వీరిలో ఎన్నో శక్తియుక్తులున్నాయి. అయితే వాటిని ఇలా వక్రమార్గంలో పయనించకుండా చూసేవిధి చిన్నతనం నుంచి తల్లిదండ్రులది. ఆ తరువాత ఉపాధ్యాయులది. ఆ తరువాత సంఘానిది. విద్యార్థులు శరీరాన్ని, మనస్సుని ఆరోగ్యంగా ఉంచుకోవటం చాలముఖ్యం (బ్రహ్మచర్యం పాటించడం). అందుకోసం బాపూ క్రిందిమార్గాలు చెప్పారు.

"శరీరాన్ని, మనస్సుని ఆరోగ్యవంతమైన పనులందు సదా నియమించాలి. చేతినిండా మంచిపనివున్నవాళ్ళ బుద్ధి వక్రమార్గాలు పట్టడానికి సావకాశముండదు. పెందలకడే నిద్రలేచుట, అపవిత్రవాఙ్మయం విసర్జించుట, లోలతని పెంచు నాటకాలకి, సినీమాలకి దూరంగావుండుట, మత్తుపదార్థాలని విసర్జించుట, సాత్వికాహారం భుజించుట చాలాముఖ్యం. శరీర మానసికారోగ్యాని కంటూ ఇలా అన్నారు. పవిత్రమైన జీవనం గడిపే శక్తినిమ్మని భగవంతుని ప్రార్థించాలి. మానవజీవిత లక్ష్యం మోక్షంగాని, అనిత్యములైన ఐహికసుఖాలు కాదు. ప్రార్థన అనగానే నిజమైన హృదయావేదనే! అదిత్రికరణ శుద్ధితో అంతరంగంనుండి వెలువడాలి. దుష్టసంకల్పానికి విరు

గుడు సన్మార్గస్వీకరణేగనుక ఎల్లప్పుడూ మంచిఅలవాట్లు అలవర్చుకోవాలంటారు. విద్యార్థిని, విద్యార్థులు ఉదాత్తంగా ఉండాలి. ఆడపిల్లల్ని తరమడం, నిక్ నేములు పెట్టి ఏడిపించడం, జడలుపట్టుకు లాగడంలోకాక వారిశక్తియుక్తులు దేశాభ్యుదయానికి, దీనజనసహాయానికి ఉపయోగపడాలి. తోటి విద్యార్థినులలో తనతల్లిని, అక్కచెల్లెళ్ళను చూడగలిగినప్పుడే ఇటువంటి అపమార్గాలుపట్టే సావకాశం లేదు. స్త్రీ అంటే కేవలం శయనవస్తువు అనేభావన పోవాలి. వారిని మాతృమూర్తిక్రింద భావించాలి. విద్యార్థినులుకూడ తమ వేషభాషలు, ప్రవర్తన, విద్యార్థులలో గౌరవంకల్గించేటట్లువుండేలా చూసుకోవాలి. ఏ కారణంచేతనైనా శీలం కోల్పోకూడదు (విద్యార్థులు కూడ). తమకిగానీ, తమతోటి స్త్రీకిగానీ అవమానం జరిగినప్పుడు దోషులను తీవ్రంగా దండించాలి. వారు ఇందుకు శారీరక, మానసికబలం సంపాదించాలి."అన్నారు."స్త్రీలుకూడ "జూడో శిక్షణ" ఇతరశరీరవ్యాయామాలు చిన్నతనంనుంచి అభ్యసించాలి. ఇవి శరీరబలానికేకాక శీలానికి ఆపదవచ్చినపుడు రక్షణకి ఉపయోగపడతాయి.

మహాత్ముడు చెప్పిన విషయాలు ఆచరించడం ఎంతో సముచితం. విద్యార్థిదశ చాలా విలువైనది. ఉత్తమమైనది. అప్పుడు మనం మనకిచ్చుకున్న శిక్షణ జీవితాంతం నిలచి పోతుంది.

మహామహులు గాంధీ, నెహ్రూ, మార్క్స్, లెనిన్ ఇలాంటి పెద్దల విద్యార్థిజీవితాలు చదువుతుంటే వారు ఎంత క్రమశిక్షణతో, ఆత్మసంయమనంతో, ఋజుప్రవర్తనతో మెలిగారో అర్థమవుతుంది. వారు అంతమంచి ప్రవర్తన ఆనాడు కలిగివున్నారు గనుకే మహానాయకులు కాగలిగారు. వారి దేశంలోనేకాక ప్రపంచం అంతటా స్తుతింపబడుతున్నారు. కనుక విద్యార్థిలోకం బాధ్యతాయుతంగా, క్రమశిక్షణతో మెలుగుతూ ఉత్తమవిద్యార్థులుగా ఉండి తోటివిద్యార్థినుల యెడ గౌరవభావం కలిగివుండాలి. బాపూజీ చెప్పిన వాక్యాలు యువతరానికే కాక అందరికీ శిరోధార్యాలే !



# శ్రీమతి అడవికొలను పార్వతిగారి రచనలు

ఆనందంతోపాటు ఆలోచనలను రేకెత్తించే రచనలు సామాజిక అభ్యుదయ సమస్యలకు దర్పణాలు.

1. ఉదయపవనాలు : (వచన కవిత)
GT III 799. వెల 3 రూ॥లు
"మీ శైలి భావన ఎంతో నచ్చాయి."
— శ్రీ దాశరథి

2. వలయంలో బానిస : (కథల సంపుటి) 6-50 రూ॥లు
"ఇంత ప్రయోజనాత్మకమైన కథలు వ్రాసినందుకు హృదయపూర్వాకాభి నందనలు" — శ్రీ నవీన్

3 పద్మాలు - పారిజాతాలు : (కథల సంపుటి) 5-50 రూ॥లు
"1975 వనితా సంవత్సరానికి ఇది ఉత్తమ కానుక. కథలన్నీ చాలబావున్నాయి."
— దేవులపల్లి రామానుజరావు

4. మందారాల మాల : (కథల సంపుటి) 6-50 రూ॥లు

5. అరుణకిరణాలు : (వచన కవితాసంపుటి) 5–00 రూ॥లు

మీ "అ రు ణ కి ర ణా లు" కాంతిని వెదజల్లుతున్నాయి. ప్రతీరచనలోను మీ భావావేశం ఉరకలు వేసింది. లక్ష్యశుద్ధి లలితంగా ఉంది. సమాజస్థాపనం, మహిళాభ్యుదయం అన్న మీ రెండు ప్రయోజనాలున్నూ అందరూ కోరదగినవి. తప్పక సాధింపవలసినవి. "ఉత్సాహం ఉద్వేగం తరగని ఆస్తిగా" "సాహిత్యం సంతోషం ఆరనిజ్యోతి"గా, మీ "అరుణకిరణాలు" సమాజాన్ని నవారుణకాంతులలో ముంచెత్తాలని ఆశిస్తున్నాను.

**Sri M. R. Apparow,** M.A., M.L.A.,
Vice- Chancellor, Andhra University.

6. రెండుతరాల స్త్రీలు : (నవల) 6–50 రూ॥లు

జయంతీ పబ్లికేషన్స్,
ఏలూరురోడ్, విజయవాడ 2.

7. కాంతివర్షం : (వచన కవిత)

8. తిరగబడ్డ నవతరం : (జయశ్రీ సీరియల్)

9. నీలాంబరాలు : (పద్యకవిత) (అచ్చులో)

ప్రతులకు :

అడవికొలను పార్వతి
అపర్ణా పబ్లికేషన్స్,
గాంధీనగరం, కాకినాడ- 4.